దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
జూన్—1957
హక్కులు కర్తవి
రూపాయిన్నర



Desi Press, Vja.

---

సంపాదకులు:
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

# అభిప్రాయము

"ఉమర్ ఖయ్యాం" జీవితచరిత్రను నాటికరూపంలో ప్రదర్శనయోగ్యంగా రచించి శ్రీ చిల్లర భావనారాయణ రావుగారు ఆంధ్ర సారస్వతానికి ప్రశంసనీయమైన సేవ జేశారు. ఉమర్ ఖయ్యాం తన రుబాయీలయందు స్తుతించిన మధువు కేవలం జ్ఞానామృతంగాని భౌతికచింతలను పారద్రోలుటకై వ్యసనముగా పరిణమించిన మధుసేవ కాదు. అతని "సాకీ" పదమునకు అర్థము వేరు. ఈ మహాకవిని సాధారణముగా తత్వవేత్తయనియు జ్ఞానియనియు భావింపక పోవడము పొరపాటు. అతని యనేక రుబాయీలవలన అతడు ఈశ్వరతత్వముపై నిగూఢవిశ్వాసంగల ఆస్తికుడని తేటతెల్లమగుచున్నది. ఈ విషయం కొంతపరిశోధించి నే నిదివరకే మనవి చేసియున్నాను. ఈ అపవాదును తొలగించుటకును ఉమరుయొక్క యదార్థజీవిత తత్వాలను సరసంగా ఆంధ్రప్రజానీకానికి అందజేయుటకును శ్రీ రావుగారు గావించిన కృషి ప్రశంసనీయము. వారికి నా అభివందనాలు.

(sd) బూర్గుల రామకృష్ణారావు

20—11—56

ప్రథమ ప్రదర్శన:- 1955 — అక్టోబర్ నెలలో హైదరా
బాద్‌లో జరిగిన నాటక కళాపరిషత్
సభలలోను,

ద్వితీయ ప్రదర్శన:- 6-9-56 న, మాజీమంత్రి డా॥ చెన్నా
రెడ్డిగారి అధ్యక్ష్యతన హైదరాబాద్
ఆంధ్ర యువతీ మండలిలోను,

శ్రీ విశ్వజిత్ నాట్యమండలి - సికింద్రాబాద్ వారిచే
ప్రదర్శింప పబడినవి.

అరగంటనాటికగా-ఆలిండియా రేడియో హైదరా
బాద్ కేంద్రంనుండి ప్రసారం చేయబడ్డది.

# మనవి

సహృదయులైన ప్రేక్షకులకు, పాఠకులకు మనవి. ఈ నాటకం లోని కథ పూర్తిగా కల్పితంకాదు. ఖయ్యాం, సాఖి, హసన్‌బిన్‌సబాహ, ఉరూజి పాత్రలు చారిత్రకమైనవి. సాఖి అనగా పర్షియన్ భాషలో ద్రాక్షరసమందిచ్చే అందమైన చిన్నపిల్లవాడు. కాని కీర్తిశేషులు దువ్వూరి రామిరెడ్డిగారు, కీ. శే. ఉమర్ అలీషాగారు, తదితరులు "సాఖి" పదం స్త్రీ పరంగానే చెప్పారు, అది నాకూ నచ్చింది. ఇక పోతే మోతియా, వజీర్‌మౌల్వీ, రుస్తుం, కుస్రూ పాత్రలు కల్పితాలు. ఖయ్యామ్ కవిత్వాన్ని, అతడి తత్వాలను సాధారణ ప్రజ అపార్థం చేసుకున్న విధానం నిరూపించటంలో వ్యక్తీకరించిన పాత్ర మోతియా. అందమైన చిన్నపిల్లల్ని తనవద్ద మధువు అందించటానికి హసన్ వినియోగించేవాడు. అట్లాంటి మగపిల్లల్ని గుల్మన్ అనేవారు. హసన్ సహాధ్యాయి, ఖయ్యామ్ పక్షపాతి, అయిన నిజాముల్‌ముల్క్ హసన్‌కూ విరోధి అయ్యాడు. నిజాముల్ ముల్క్ కుమారుణ్ణి, తల్లిదండ్రులను గోల్పోయినవాణ్ణి ఖయ్యామ్ కాపాడటం, హసన్ చెఱగొనే ప్రయత్నం - నాటకీయమైన పన్నుగడ అయినా-సత్యదూరం, అసహజం కావని నా తలంపు. అందుకనే కుస్రూకు హసన్ తరువాత చారిత్రకంగా యేలాంటి ప్రాతినిధ్యం యివ్వబడలేదు. రుస్తుం పారశీక వీరుడుగా ప్రఖ్యాతి వహించిన రుస్తుంకాడు. ఆ పేరుగల మరియొక యోధుడు, హసన్ ప్రధాన సేవకుడు. మౌల్వి-ఇతడు ఆనాడు కరడుకట్టిన మూఢమైన మత విశ్వాసాలకు చిహ్నం. ఇస్లాం మతానికంతటికీ ప్రాతినిధ్యం వహించినవాడు కాడు. ఇస్మయీలియాల ముఠాలో ఒకడు. వజీర్ - పాదుషాకు అమాత్యుడు. హసన్ బిన్‌సబాహ మరణం చారిత్రకంగా ఖయ్యాం మరణం తరువాతనే, ఈ నాటకంలో ఖయ్యామ్

జీవించి యుండగానే హసన్ మరణిస్తాడు. ఈ సంఘటన హసన్ నైతిక పతనానికి సూచనగా మాత్రమే చారిత్రకులు భావించ ప్రార్థన.

కీ॥ శే॥ ఉమర్ అలీషాగారు రచించిన ఉమర్ ఖయ్యామ్, కీ॥ శే॥ దువ్వూరి రామిరెడ్డిగారు రచించిన, "పానశాల", ఆంగ్లంలోని ఫిజ్జెరాల్డు రచన, కీ॥ శే॥ ఆజ్జాడాదిభట్ల నారాయణదాసుగారి "రుబాయియాత్" ఈ నా రచనకు తోడ్పడ్డాయి. ఆ గ్రంథకర్తలకు నా కృతజ్ఞతలు. సికింద్రాబాద్‌లోని ఇస్లామియా హైస్కూలు వైస్ ప్రిన్సిపాలుగా ఉన్న శ్రీ యల్లాప్రగడ లక్ష్మీనారాయణగారు తమ పారశీ భాషా పరిచయంవల్ల నాకు పర్షియన్ సాంప్రదాయాలగురించి, ఖయ్యామ్ యథార్థ మనస్తత్వాన్ని గురించి సలహా ఇచ్చారు. వారికి నా కృతజ్ఞత.

ముఖ్యంగా అనివార్యమైన రాజకీయ కార్యభారం ఉన్నప్పటికి సహజంగా సాహిత్యంపైగల అభిమాన అభినివేశాలవల్లనూ, నాపై ఆదరంవల్లను, తమ అమూల్యాభిప్రాయాన్నిచ్చిన శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారికి సర్వదా కృతజ్ఞుడను.

—రచయిత

# పాత్రలు:

ఉమర్ ఖయ్యామ్:- నలభై సంవత్సరముల వయస్సు. దృఢమైన దేహం. సంతలోల్లాసమైన ప్రవర్తన. గంభీరమైన మూర్తి. ఉన్నత విగ్రహం. పర్షియన్ సాంప్రదాయానుసారంగా కట్టుకొన్న తలపాగా. మోకాళ్ళవరకు అంగరఖా. చౌడీదార్ పైజామా. కాళ్ళకి ముచ్చెలు. నడుముకి పట్కాగా కట్టుకుని కొంత వేళ్ళాడుచున్న అందమైన వస్త్రం. అందమైన బట్టలో కట్టిన పుస్తకం. కొనదేలివున్న ముక్కు, నిశితమైన చూపు ఆకర్షణీయంగా ఉంటాయి. చెంపలమీదుగా కొద్దిగా పెరిగిన చిన్నగడ్డం. సన్నని మీసాలు వర్తనలోను, పలుకులోను నిండుదనం, గాంభీర్యం, మృదుత్వం తొణికిసలాడుతుంటుంది. గొప్ప ముఖవర్చస్సు.

సాఖి :- ఉమర్ ఖయ్యాముకు జీవనమధు వందిచ్చు సౌందర్యరాశి. అతడికి ఆమె విశ్వసౌందర్యాధిదేవత. ఆరాధ్యమూర్తి. అందమైన కన్నుగవ. చిన్నని నోరు. చెక్కిలిమీద చిన్న మచ్చ. పర్షియన్ సాంప్రదాయానుసారంగా ధరించిన దుస్తులు. ఆడుతూ పాడుతూ కాలం గడిపే స్వేచ్ఛాజీవి. ఉమర్ అంటే ఆమెకు ప్రాణ సమానం. ఆమెలో ఖయ్యామ్ కున్న నిబ్బరంలేదు. బేలతనం, అమాయకతలే ఆమెకు అలంకారాలుగా ఉన్నై. కష్టపాటు వినలేదు. ఆనందం పట్ట లేదు. బుద్ధిశాలిని. సమయస్ఫూర్తిగా చతురంగా మాట్లాడగలదు. వయస్సు దాదాపు ముప్పైసంవత్సరాలు.

హసన్ బిన్ సబాహ:- ఖయ్యాముకు సమవయస్కుడు. పర్షియన్ పాదుషాలకు ఉచితమైన వేషం. ఈర్ష్యాళువు, కుత్సితమతి అని చూపులే చెబుతూంటాయి. తెచ్చుకున్న పాదుషాప్రవర్తనతప్ప సహ

జంగా పాదుషాలకుండే హుందాతనం లేదు. ఉర్దూ అరబ్బీలపై గౌరవం ఎక్కువ. ఈతడు "ఇస్మాయీలియాల" సంఘమునకు అధిపతి. ఇస్మాయీలియాలు వొక ప్రత్యేక మతాభిప్రాయములను ప్రజలపై రాజకీయాధిపత్యమున రుద్దుటకు ప్రయత్నించిన వ్యవస్థ. ఇతని అనుచరులను "ఫిదాయీ" లందురు. చావును జయించాలని, భూలోకంలోనే స్వర్గసౌఖ్యముల నెలకొల్పాలని హసన్ ఆదర్శం. మనశ్శాంతిలేక నిరంతరం యేదో చింతతో బాధపడుతుంటాడు. సంతోషంగా ఉండాలని యత్నిస్తాడు. కాని ఉండలేడు. ఎవ్వరినీ నమ్మలేడు. పైకి మహాధైర్యశాలిగా, యోధుడుగా నటిస్తాడు కాని వట్టి పిరికిగుండె. చదువుకున్నవాడు. కుట్రపన్నటంలో నేర్పుకలవాడు. గాఢమైన మతాభిమాని. మూఢనమ్మకాలు కలవాడు. మెళ్ళో పూసలపేరు ధరిస్తాడు.

మౌల్వీ :- వయస్సు యాభై ఏళ్ళ పైబడియుంటుంది. పొడుగాటి గడ్డం. పూర్తి అంగరఖా. తలపాగా. అల్లా నుచ్చరిస్తూ పూసలపేరు తిప్పుతూనే అత్యాచారాలను చేస్తుంటాడు. చదువుకొన్నవాడు. హసన్‌కు కుడిచెయ్యి. అతడి ప్రాపకంకోసం యేమైనా చేస్తాడు. వయస్సు పండినా వాంఛలు పోలేదు. హసన్‌కు వినోదంకూర్చటమే అతడి పనిగా భావిస్తాడు. కాలు కుంటి.

వజీర్ :- హసన్‌వద్ద వజీర్. దాదాపు మౌల్వీ వయస్సు. తను తన ప్రభువు మన్నన పొందాలి. దాని కతడు చెప్పిందల్లా చెయ్యాలి. అతడు నవ్వితే నవ్వాలి. విచారిస్తే విచారించాలి అన్న స్వభావం. తెలివితక్కువగా మాట్లాడుతాడు. సరిదిద్దుకోబోతాడు.

రుస్తుం :- హసన్ మందిరంలో ప్రధాన సేవకుడు. మంచి కండపుష్టి కలమనిషి. తెలివైనవాడు. ఎవరితో యెలా సంచరించాలో తెలుసు. తను సొమ్ము చేసుకోటమే పరమావధి.

ఊరూజి :- వయస్సు దాదాపు ముప్పైఅయిదు. శాంత స్వభావుడు. ఖయ్యామ్ అంటే అమిత భక్తి. శిష్యుడు. మంచి పండితుడు. కవుల చరిత్రకారుడు. ఖయ్యామ్ శ్రేయస్సుకై నిరంతరం కృషిచేస్తాడు.

మోతియా :- హసన్ బిన్ సబాహ ప్రేయసి. బేగం సాహేబా. గొప్ప తంత్రజ్ఞురాలు. తన సౌందర్యంచేత రాజ్యాలు మార్చిన సాహసురాలు. హంతకి. పైకి మధురంగా మాట్లాడుతుంది. చదువుకున్నది. ఖయ్యాం రుబాయీల నపార్థం చేసుకున్నది.... ధైర్యవంతురాలు. నిగూఢంగా మాట్లాడుతుంది. ఎప్పుడూ చక్కగా ముస్తాబై ఎక్కువగా ఆభరణాలు ధరిస్తుంది. సహజసౌందర్య కాదు.

కుస్రు :- పన్నెండేళ్ళ అందమైనపిల్లవాడు. నిజామ్ ముల్క్ పుత్రుడు. తల్లితండ్రులు పోగా ఖయ్యామ్ పోషణలో నున్నాడు. తెలివైనవాడు.

కథా కాలం :- పదకొండో శతాబ్దం. ద్వితీయభాగం.

స్థలం :- నైషాపూర్.

సెట్టింగ్సు - రెండు.

1. ఉమర్ ఖయ్యామ్ నివసించు తోట. అందమైన గుడారంమీద పూలతీగెలు అల్లుకొనివుంటై. ద్రాక్షగుత్తులు వ్రేళ్ళాడుతుంటై. అక్కడక్కడా పూలతొట్లు. ఖర్జూరపుచెట్లు. పైన వాలిన కొమ్మలు. ప్రక్కగా ప్రవహించు సెలయేరు. గుడారంవాకిట నగిషీతో ఉన్న ఒక చిన్నపీట. దానిమీద తెల్లగా మెరసే మధుకలశము. ఆ ప్రక్కనే మధువుత్రాగే పాత్ర. పచ్చని గడ్డి. మధురప్రకృతి. గాలికి కొమ్మలు కదలినప్పుడల్లా జల జలా పూలు రాల్తుంటై. దివ్వెన ఎగసే పావురాలు.

(2) హసన్ మందిరం :- పర్షియన్ సాంప్రదాయానుసారంగా అలంకరించబడి వుంటుంది. సుగంధ ద్రవ్యాల గుబాళింపుతో రంగు

రంగుల ప్రకృతి చిత్రాలతో శోభాయమానంగా ఉంటుంది. హసన్‌కు ప్రత్యేకంగా అమర్చబడిన మెత్తని గద్దె. ప్రక్కనే హుక్కా. పళ్ళెంలో కొన్ని పండ్లు, పూలు, పంజరంలో బంధింపబడ్డ చిలుకలు. మరికొన్ని ఉన్నతాసనాలు. చివరి రంగంలో ఒక అందమైన పాన్పు.

ఈ నాటక ప్రదర్శనకు బాగా "Depth" ఉన్న స్టేజీ అవసరం. ఫ్రంట్ డ్రాప్ కాక రెండు తెరలు కావాలి. ఉమర్ తోట చూపించే తెర స్టేజీ వెనక భాగంలో ఉంటుంది. దాన్ని కదిలించ నవసరంలేదు; మధ్య హసన్ మహల్ చూపే తెర, ఈ రెండు తెరలకీ మధ్య ఉమర్ తోట మొదటి సెట్టింగ్ ప్రకారం అమర్చి ఉంటుంది. నేలమీద ఆకుపచ్చనితివాసి. రెండవ కర్టన్‌కి ముందు రెండు వైపులా వెదురు బద్దలతోగాని ఖరీదైన కొయ్యతోగాని మహల్ లోనికి ద్వారాలు. (సైడ్ వింగ్సువద్ద' కిటికీలు- విడి విడిగా కాక ఒకే 'ఆర్చి' లో తయారుచేసి అందమైన రంగులతో కర్టన్‌లతో అమర్చి ఉంచాలి. మహల్ సీను వచ్చినప్పుడు మాత్రం ఇవి కనిపిస్తే, తోట సీనులో వీటిమీద ఆకుపచ్చని పరదాలు దిగేసి ఉంటై. మహల్ సీను వచ్చినప్పుడు ముందే అమర్చిఉంచిన మెత్తని దిండ్లను గద్దెల్ని వడిగా అమర్చుకోవాలి లైటింగ్ ఎఫెక్ట్ విషయంలోను, సంభాషణల కడ్డురాని సన్నని బాక్‌గ్రౌండ్ సంగీతంలోను, ప్రత్యేక శ్రద్ధ వహించాలి. ప్రదర్శన రెండు గంటలకు మించరాదు.



# ఉమర్ ఖయ్యామ్

## ఒకటవ రంగము

*ఉమర్ నివసించు తోట. ద్వారం తొలగింపబడుతుంది. సాయం కాలపు నీరెండలు పచ్చగడ్డిమీద పడగా ప్రకృతిశాంతసౌందర్యము సంగ్రహించుకుంది. పావురంజంట ఒక్కసారి ఎగిరిపోయింది. చేతిలో చిన్న నీళ్ళజెంబుతో సాకీ పాడుకుంటూ వయ్యారంగా ప్రవేశిస్తుంది.*

ఓ హాఁ హాఁ ఖయామా
రావో హాఁ ప్రియతమా
కొసరికొసరి మధువానే నెయ్యమా
రావోహాఁ ప్రియతమా ॥ఓ హాఁ హాఁ॥
సుమజీవన మోహనా
సఖి సాకీ అందించే
మధువు లాని మనసులోని
అమర కవిత లందింపుము ॥ఓ హాఁ హాఁ॥
పూలపొదలు ద్రాక్షలతలు
అరవిచ్చిన పోసనీలు
బుల్ బుల్ పిట్టల రవళుల్
బిలబిల పాఱే నదుల్
నీ రూపే తలపించెనులే
నీ మనసే వినిపించెనులే ॥ఓ హాఁ హాఁ॥

*తెరలోనుండి సంభాషణలు వినపడతాయి. హసన్, వజీర్ ప్రవేశం*

హసన్:- ఖామూష్... (సాఖి వెళ్ళినవైపుచూస్తూ) పాదుషా తనకోసం నిరీక్షిస్తున్నా రని చెప్పు వజీర్!

వజీర్:- జీహాఁ! (ప్రక్కగావెళ్ళి సాఖితో ప్రవేశం) మన సర్కార్ షికార్కుపోయి వాపస్ వచ్చినారు. అల్లా మీాయందే యున్నారు. సర్కార్ దప్పికగొన్నారు.

హసన్:- (సాఖితో) ఉమర్ఖయ్యామ్, మేమూ ఆబాల్య స్నేహితులం. పాదుషాలమైనా పరాయివాళ్ళం కాము సాఖీ!

సాఖి:- (మధుపాత్రవంక చూస్తూ) సర్కార్కు స్వాగతం చెప్పుకో అంగూర్కి ప్యాలి.

వజీర్:- సాఖి ప్యాలీతో సంభాషిస్తున్నది జహాఁపనా - మీా ప్రశ్నకు -

హసన్:- అందుకు మేమ్ ఆగ్రహం చెందం. అద్భుత అందమైన స్త్రీలకు మరింతసొగసు వస్తుందని రసజ్ఞులైన మీాకు తెలియక పోలేదు వజీర్.

వజీర్:- పాదుషాభావం సాఖీ గ్రహించలేకపోదు. పర్షియా ప్రభువు పటకుటీరంముందు నిలచి దాహంతో ద్రాక్షాసవం అర్థిస్తున్నారు. జాగుచేయకే. (సాఖీవంక ఓరగా చూస్తాడు)

సాఖి:- (మధుపాత్రనంకే చూస్తూ) ఖయ్యాం పెదవి ఆని కవిత్వం వర్షిస్తావు. పూర్వం నువ్వూ మనిషివేమో నంటావే. బదులుపల్కవేం అంగూర్కి ప్యాలి? సాఖీ తనచేతిమీాదుగా ఖయ్యాముకుతప్ప మరోవ్యక్తికి ద్రాక్షాసవం అందించదని- తామే అందుకోమని...

హాసన్:- (కోపంతో) ఏ ఇజ్జత్ కీ బాత్ హై.

వజీర్:- అతిథిని ఆహ్వానించి గౌరవించటం తెలియని మూర్ఖులు.

సాఖి:- అంతా అర్థమైపోయింది, నీకు బాగా తెలుసుకదూ, ఎవరికి ఎలా మర్యాదచేయాలో -

వజీర్:- విన్నారా జహాపనా! ఎంత పొగరు? ఇంటికొచ్చిన పెద్దల్ని ఈలా గేలి మాట్లాట్టం. అవును, ఇందులో క్రొత్త యేముంది? ఖయ్యాం అల్లానే దూషిస్తాడు. ఇక ఖయ్యాం బీబీ అతిథుల్ని అగౌరవించటంలో తప్పేముంది?

హాసన్:- (పండ్లు కొరుకుతాడు) ఖయ్యామ్... అల్లానే దూషిస్తాడు.. వజీర్, రేపే అతణ్ణి మాముందు హాజర్ చెయ్.

సాఖి:- (విచారంగా) హాఁ. ఖయ్యామ్- ఖయ్యామ్!... పాదుషా అనాలోచితంగా ఆగ్రహావేశు డౌతున్నాడు. తప్పంటే ఈ సాఖినే అడగవచ్చు... నామూలంగా ఉమర్ ఖయ్యామ్ అంతటివాడు ఒకసామాన్యపాదుషా ఆగ్రహానికి గురికావటం పర్షియా ప్రతిష్ఠకే భంగం.

హాసన్:- (సాఖిని ఓరగాచూస్తాడు) ఖయ్యామ్ని శిక్షించగల్గిన పాదుషానుకూడా, తలచుకుంటే దండించగల్గిన వ్యక్తిని గుర్తుంచుకోమను వజీర్ !

వజీర్:- విన్నావా సాఖి !

సాఖి:- (ప్రక్కకి పోతూ) ఖయ్యామ్-ఖయ్యామ్ - (తలవంచుకుంటుంది)

వజీర్:- మాలిక్ షా మన్ననతో నైమరచిన ఉమర్ సాఖీలు మరి-

హాసన్:- ఈరోజు మనల్ని పూర్తిగా మరచారంటావ్ కదూ వజీర్ ! సచ్ హై -

వజీర్:- అల్లాని దూషించటం, అతిథుల్ని అగౌరవించటం, పాదుషాను లెక్కచెయ్యకపోవటం ఖిలాఫ్ ద్రోహం. వీళ్ళు తక్షణం శిక్షార్హులు. ఖయ్యామ్ రుబాయీలు దేశంలో ఆనోటఆనోటపడి ప్రచారంపొందుతున్నయ్. ఇకచూస్తే ఈబుద్ధిమాలినప్రజలు ఖయ్యామ్‌మాటల్ని నమ్మి అల్లానే దూషిస్తారు. అల్లానే నిరశించేప్రజలు ఇక పాదుషాను...

హాసన్:- వజీర్, ఆపు. అర్థమయింది. రేపు మౌల్వీలఎదుట ఈ విషయం దర్యాప్తుచేస్తాం. రుబాయీల చదివే వాళ్ళని కఠినంగా దండిస్తాం. ఖయ్యామ్‌ని దేశంనుండి బహిష్కరిస్తాం. (ముందుకు పోబోతాడు. సాఖీ మాటలు విని ఆగుతాడు)

సాఖీ:- అంగూర్ కప్యాలి! అలా మౌనంవహించిఉన్నావ్ ! పాదుషాకు నిజంచెప్పు. వజీర్‌జీకీ నిజం తెలియదు. తగినట్లూ తాళంవేస్తున్నాడు. అల్లాపేరుతో ఘోరంగా అత్యాచారాలు చేసేవాళ్ళని అల్లా కఠినంగా శిక్షిస్తాడు కదూ!

హాసన్:- సాఖీ- (గద్దిస్తాడు. వెనక్కితిరిగి ఆమె విచారమైన వదనాన్ని చూసి దిగజారిపోతాడు) సాఖీమీద మా కెలాంటి ఆగ్రహంలేదని చెప్పు, వజీర్.

వజీర్:- సమాజుకు వేళయింది జహాపనా!

హాసన్:- వస్తున్నాం పద...

*వజీర్, హాసన్ వెళ్తారు. సాఖీ విచారంగా ఉంటుంది.*

సాఖి:- (పాట)

సమాజు లెవరికీ – ఈ
రివాజు దేనికీ? ॥సమా॥
ఖాజీల ముతవల్లీల
ఖజానాల కొరకేనా?
ఖయ్యాము రుబాయీ
అల్లా దూషణలేనా
అల్లాదూషణలేనా ॥సమా॥

*తెరలోపలినుంచే ఉమర్ ఖయ్యాం పద్యం వినబడుతుంది. క్రమంగా ప్రవేశిస్తాడు.*

పున్నమరేయి వచ్చె మధువున్ గొనితెమ్ము తలోదరీ! రసా
భ్యున్నతి దేలిపోవుదము! ఊయలలూగుచు బ్రేమడోలికన్
నిన్నటిబాధలన్ మఱచి నేరని రేపటిభీతి మాని నీ
హృన్నవసూనమందు నిదురింపగనిమ్ము ఖయామభృంగమున్.

సాఖి:- (విచారాన్ని మాటుపరచి ఖయ్యాము ముందుకు వస్తుంది) రసముగ్ధుడైన ఖయ్యాముకు మధుపాత్రతో సాఖి సుస్వాగతం చెబుతున్నది.

ఖయ్యా:- (సాఖిని తేరిపారజూచి) సాఖి! ఎందుకో విచారంగా ఉన్నావు?

సాఖి:- అది తమ కేలా చెప్పగలరు?

ఖయ్యా:- మబ్బులోనిండిఉన్న నీళ్ళలాగా నీకాటుకకండ్లలో నిలచిన అశ్రువులే చెబుతున్నయ్!

సాఖి:- అవి ఆనందబాష్పాలెందుకు కారాదు?

ఖయ్యా:- వడగాలికి కందిన పూలరేకుల్లా ఉన్న నీ చెక్కిళ్ళు ఎక్కడ దాస్తావు?

సాఖి:- (విచారంగా) ఖయ్యామ్! ఈరోజు చాల చెడ్డది.

ఖయ్యా:- నాకు ఈ రోజంత ఆనందప్రదమైంది మరోరోజు లేదేమో సాఖి! ఖుషీగా మధువు త్రాగాలి... ఏదీ?

సాఖి:- (మధు నందిస్తుంది) ఖయ్యాం ఇంతఆలస్యంగా రావటానికి కారణం?

ఖయ్యా:- మాల్వీకీ నాకూ మతవిషయంలో వాగ్వివాదం వచ్చింది. అందులో -

సాఖి:- తమదే విజయం!

ఖయ్యా:-యథార్థానికేవిజయం.అందుకు మాల్వీమండిపడుతూ పగ సాధిస్తానన్నట్లు వెళ్ళిపోయినాడు.

సాఖి:- నిజంగానా ఖయ్యామ్! ఇక్కడికి సాదుషా వజీర్‌తో వచ్చాడు.

ఖయ్యా:- హసన్ వచ్చాడా!

సాఖి:- అవును. అతడూ మీరూ ఆబాల్యస్నేహితులట!

ఖయ్యా:- ఉచితంగా సన్మానించావా?

సాఖి:- ఆహా, ఉచితంగానే... మీమీద అతడికెందు కంత పగ పాయిజార్‌జీ!

ఖయ్యా:- హేదేకీజాం. అధికార దుర్గర్వం సాఖి! అంతేకాదు, మొదటినుండి ఈర్ష్యాళువు...

సాఖి:- వస్తూనే వికటంగా నవ్వాడు, మీపేరు తలుచుకొని. నన్ను మధువు ఇవ్వమన్నాడు. అతడిచూపులు సూదుల్లా ఉన్నై. అబ్బ! ఆపశువును తలుచుకుంటే వా డన్నమాటలు జ్ఞప్తికొస్తయ్ ఖయ్యామ్!

ఖయ్యా:- తఖ్తుపై నెక్కి దర్జాలు వెలిగించదలిచాడు కాని, సాఖి!

సాఖి:- పాదుషా అని పిలవబడటానికే తగడు. ఎంతటిపాదుషాలైనా ఖయ్యామ్ నామోచ్చారణతోనే కడకండ్లు మూసిపోయినట్టుగా భావిస్తారు. కాని వీడు మిమ్మల్నే శిక్షిస్తాట్ట, ఖయ్యామ్!

ఖయ్యా:- అహ్హాహ్హా! ఒకదొంగ - ఒకహంతకుడు - ఇస్మయీలియాల నాయకుడు ఖయ్యామ్‌ని శిక్షిస్తాడా! ఆల్‌మత్ దుర్గాన్ని స్వాధీనపరచుకొని అత్యాచారాలతో ఈస్థితికి వచ్చినవాడూ- పవిత్రమైన పాదుషాశబ్దానికి అర్హుడుకూడానా?

సాఖి:- బలవంతంగా పిలిపించుకుంటున్నాడు పాదుషా అని.

ఖయ్యా:- మెర్వ్‌పట్టణంనుండి కుస్రూను ఉరూజీ తీసుకువస్తుంటే - దారిలో ఈహంతకులు ఏప్రమాదంగానీ-

సాఖి:- ఖయ్యాంజీ! నా కేమో ఈరోజు చాలభయంగా ఉంది. కుస్రూ పాపం పసివాడు. తల్లీదండ్రీ లేనివాడు. కన్నబిడ్డలా కాపాడుకుంటున్నాను. కాని తమరే సదరుద్దీన్ అహమ్మద్‌వద్దకు పంపించారు. నామాట విన్నారా?

ఖయ్యా:- కాని, నీకోరిక నెరవేరింది, సాఖి. అక్కడివాళ్ళలో కుస్రూ కలిసిమెలిసి ఉండలేక బెంగపడినాడనేగా

ఉరూజీని నాస తీసుకు రమ్మన్నది. రెండురోజుల్లో వచ్చేస్తాను.

సాఖీ:- పాపం, కుస్రూ నాకై బెంగపడ్డాడేమో!

ఖయ్యా:- ఏమైనా కుస్రూను మనవద్ద వుంచరాదు, సాఖీ! ఇక్కడ ఏరక్షణా లేదు. హసన్‌కి తెలియకుండా పెంచాలి. పెద్దవాణ్ణి చెయ్యాలి. నామిత్రుడైన నిజామ్ ఉల్ ముల్క్ ఋణం నేనుతీర్చుకోవాలి. హసన్ ఇక్కడికి వస్తాడంటున్నావ్. కారణంలేందే కాలుపెట్టడు.

సాఖీ:- కాని, ఏమీ ఎఱుగనట్టే ప్రవర్తించాడు! ఈతోటలోనే ఖయ్యామ్ నివాసమని, నజీర్ చెప్పాడు.

ఖయ్యా:- దగాచేసేగుణం వాడిది. వాడినైజం నాకు తెలుసు.

సాఖీ:- అవును. వాడిచూపులు గమనించితే చాలు, వాడెంతకైనా సాహసించేలా కన్పిస్తాడు ఖయ్యాంజీ! పైగా వాడికితోడు నజీర్. మీరేమో అల్లానే దూషిస్తారనీ మీ రుబాయీల నెవరూ చదివి దైవదూషకులవుతున్నారనీ ఏవేవో చెప్పాడు.

ఖయ్యా:- (నవ్వి) అల్లానే దూషిస్తాను. నిజం. సాఖీ! మానవమాత్రులను తప్పుపట్టి ప్రయోజనం? మనమంతా అతడిసృష్టి. ఈ సృష్టిలో తప్పున్నదంటే ఆ అల్లాదే తప్పు. మరి అల్లాను దూషించక భూషించటమే ఎలా సాధ్యమవుతుంది?

సాఖీ:- అల్లాని దూషించటం ఆచారవిరుద్ధంకాదా ఖయ్యాం?

ఖయ్యా:- అల్లాని దూషించటంగాని భూషించటంగాని నేను ఆచారంగా పెట్టుకోలేను. ఆ రకంగా భావించేవాళ్ళకి

ఆచారవిరుద్ధమే కావచ్చు. ఇంతటిసుందరప్రకృతిని సృష్టించిన మేధావి హసన్‌లాంటి పాదుషాలను పుట్టించి ఎంత బుద్ధితక్కువపని చేశాడా అని విచారిస్తాను. అవసరమైతే దూషిస్తాను.

సాఖి:- ఆగండి, ఖయ్యామ్! పాదుషా పడమటివైపున సిప్పాలు త్రొక్కుతున్నాడు చూచారా ?

ఖయ్యా:- ఆ కెమ్మోవిఅనిన మధుపాత్రలాఉండే ఆపరిపూర్ణ చంద్రబింబం అరుణరక్తిమలతో తూర్పున నన్నాహ్వానిస్తుంది. ఇకపాదుషామొహంచూచేదెవరు! సాఖి?

ఈ నవశాద్వలాన్విత మహీతలశయ్యల మేనువాల్చి చానా! నినుగూడి యాసవము నానుచు దేలుచు రాగరక్తి సౌఖ్యానుభవమ్ములొందెడుఖయామునకేల సుహమూదుపాదుషాధీన సమస్తరాజ్య విమ తేరగవచ్చినగాని మెచ్చునా ? ॥

హృత్తటి నీతటమ్ము తెగి ప్రేమసుధాధుని పొంగిపొర్లగా బిత్తరి ! పానపాత్రలను నింపగవచ్చిన ద్రాక్షకాంతవో ! కుత్తుకనిండుగా మధువుగ్రోల ఖయాము తయారిదే రసోన్మత్తుడుకాన లౌకికజనమ్ములమాటల లెక్కసేయునా ! ॥

గతమునకై విచారపడగా వల దింక, భవిష్యదర్థపుంగతి అతిసంశయాస్పదము కాన నిజమ్ముగ వర్తమానమే మతిగలవారికిక్క మధురమైన నితాంతవసంత మాట నే నతులితభోగపానరసికాత్మత వ్రాలితి నీదుకౌగిటన్॥

సాఖిని తనవైపు లాగుకొంటాడు. సాఖి సిగ్గులో విలవిలలాడుతుంది

— తెర —

# ఉమర్ ఖయ్యామ్

## రెండవ రంగము

ఖయ్యామ్ నివసించు చోట

ఖయ్యా:- ఎవరు? - ఓ మోతీ! ఈలా రా!

మోతి:- కుస్రూ ఎక్కడ? షాయిర్ జీ!

ఖయ్యా:- సాఖీవద్ద ఉన్నాడు. రోటీ తింటున్నాడు. సాఖీ!

సాఖి:- జీం! (ప్రవేశం) ... మోతీ! వచ్చావా? నీమేలు ఎన్నటికీ మరువం.

మోతి:- అది నావిధి. నాప్రత్యేక తేముంది?

ఖయ్యాం:- తమవిధినిగుర్తించి నడచుకొనేవా ళ్లెందరున్నారు, మోతీ!

మోతి:- తమకు నామీాదఉన్న సదభిప్రాయమే-

సాఖి:- అవును. కాని, మోతీ!కుస్రూను విడిచిఉండ లేనమ్మా.

ఖయ్యా:- సాఖి!...హసన్ కుస్రూమీాద కుట్రపన్నుతున్నాడని ఉరూజీ మాటలవల్ల తెలుస్తూనే ఉంది.

మోతి:- అది యథార్థం.

సాఖి:- అంతగట్టిగా నువ్వెలా చెప్పగలవు?

ఖయ్యా:- నిన్న కుస్రూను ఉరూజీ మనవద్దకు తీసుకొస్తున్నప్పుడు హసన్ అనుచరులు కుస్రూను అపహరించాలని చేసినపన్నుగడ వినలేదా సాఖి!

మోతీ:- సమయానికి ఆవిషయం తెలుసుకొన్నాను. ముందుగా జాగీర్ ఉదారాజీని కలుసుకొని, ఈవిషయంచెప్పమని మావాళ్ళకి చెప్పి పంపించాను.

నాఖి:- హంతకుల దుష్టప్రయత్నాలు తెలుసుకోగల్గావంటే వారికీ నీకూ కొంతసంబంధ ముండితీరాలి.

మోతీ:- నన్ననుమానించకండి...

ఖయ్యా:- అనుమానించవలసినకారణం లేదు.

మోతీ:- కస్తూరితల్లి బ్రతికుండగా ఆమెబాందిగా పనిచేశాను. ఈ మోతీఅంటే కస్తూరికి ఎక్కడలేనిఆపేక్ష. ఇక్కడ కస్తూరిఉండటం చాలప్రమాదం. రహస్యంగా నావద్ద ఉంచుకున్నాను...

నాఖి:- కస్తూరిమాటవినిపించేసరికి నాకు ప్రొద్దుపోతుంది. కాని కస్తూరిభవిష్యత్తుకై, మోతీతో పంపకతప్పదు. మోతీ!

మోతీ:- కస్తూరిని నాప్రాణసమానంగా చూసుకుంటానమ్మా! అల్లామీద ఖసమ్‌తిని చెప్తున్నాను.

ఖయ్యా:- మోతీ! కస్తూరిసంరక్షణభారం వహించటమేకాదు, అతడికి అన్నివిద్యలు చెప్పించాలి. అందుకుకావలసిన ధనం మేం ఇస్తాం.

మోతీ:- వారిఉప్పుతిని బ్రతికినదాన్ని. నా శక్తివంచనలేకుండా కస్తూరికి అన్నిసదుపాయాలూ చేస్తాను, ఖయ్యాంజీ! తమదగ్గర సెలవు తీసుకుంటానా?

నాఖి:- కస్తూరి, కస్తూరీ...

కస్తూ:- (పరుగెత్తుకొస్తాడు) ఓ మోతీ, మోతీ...

మోతీ:- అవ్, కస్తూ అవ్. (దగ్గరతీసుకొని తలనిమురుతుంది)

సాఖి:- ఖుస్రూ! మోతీవెంబడి పోతావ్!

ఖుస్రూ:- నేను మోతీవెంబడి పోతాను. అక్కడే వుంటాను. రహీమ్, నేను ఆడుకుంటాం.

ఖయ్యా:- రహీం ఎవరు?

మోతి:- నాపిల్లవాడు షాయిర్ జీ!

ఖయ్యా:- మోతీ! ఖుస్రూకు నీపట్ల బాగా మాలిమిఉందని తెలుస్తున్నది. ఉరూంజీ నిన్నుగూర్చి చెప్పాడు. నిన్ను పూర్తిగానమ్మి ఈ పసివాణ్ణి నీకు అప్పగిస్తున్నాము.

సాఖి:- హాసన్ ఖుస్రూను మోసంచేసి యేమైనా దుర్మార్గం తలపెట్టవచ్చు.

ఖుస్రు:- చాచీ! నేనే ఖతంచేస్తాను. ఖుస్రూ ఖాన్ బడా వస్తాద్ హై.

సాఖి:- వస్తాద్ - సచ్ బేటా!

ఖయ్యా:- తండ్రికి తగ్గకొడుకు.

సాఖి:- మోతీ! ఖుస్రూను ప్రతిదినం ఒకసారి తీసుకొచ్చి నాకు చూపించి వెళ్ళాలి.

మోతి:- హాసన్ చూడకుండా, అతని సేవకులకు తెలీకుండా, రోజూ ఖుస్రూను మీావద్దకు తీసుకురావటం చాలా కష్టం, షాయిర్ జీ! తమరే చెప్పండి.

ఖయ్యా:- అవును, మోతీ! మేము అడిగినప్పుడు తీసుకు రావాలి. మీా మకాన్?

మోతి:- బడీ మస్జిద్ వెనకగల్లీలో...

ఖయ్యా:- వెళ్ళిరండి మోతీ!-ఖుస్రూ! వెళ్ళిరా నాయనా.

సాఖి:- ఖుస్రూ...

మోతి:- మంచిది పాయిూర్‌జి! (కుస్రూతో వెళ్తుంది).

సాఖి:- కుస్రూ ఎడబాటుగూర్చిన యీ ఉదయం నాకు చాల బాధకలిగించింది, పాయిూర్‌జి!

ఖయ్యా:- మత్తుగా నిద్రపోతూ హాసన్‌అనుచరులు ఇంకా నిద్రలేచివుండరు. అందుకే ఈ వేకువనే మోతీ కుస్రూను తనఇల్లుచేర్చటానికి త్వరపడ్డది. ఈ తొలి ప్రొద్దుల సోయగాన్ని కాంచి ఆనందించలేకపోతు న్నావు. వేదనతో, నైరాశ్యదృష్టితో ఈ అరుణో దయంలోని 'ఉజ్జ్వలసౌందర్యాన్ని చూడలేకపోతు న్నావా సాఖి !

అదిగో! ఆ సులతాను హర్మ్యశిఖరం బంధున్న యూపావురాల్ నిదురల్ మానగ,బైడీయుచ్చులను పన్నెన్ ప్రాగ్దిశాభూములన్ గదలన్ సాగెడివేటకాడు,కయిపెక్కన్ నన్ను త్రావింపు మీ హృది కింపౌ మధురానుభూతులను వర్ణింపంగచానా! సురన్॥

సాఖి:- అవును. తమలాంటికవులు చెబితేనేగాని ప్రకృతిలోని ఈ రమణీయత మాకు కనిపించదు, పాయిూర్‌జి! ఈ ఉదయం ఎంతమనోజ్ఞంగా ఉంది! ఇంతకంటెకూడా నాలోని విచారాన్ని ఒక్కసారిగా పారద్రోలగల్గిన తమ రుబాయత్ ఇంకా మనోహరంగా ఉంది.

ఖయ్యా:- మధుకలశమ్ అందివ్వు సాఖి!

సాఖి:- తెస్తున్నా పాయిూర్‌జీ! (వెళ్ళి మధుకలశమ్‌పాత్ర పట్టుకొని మెల్లగా వస్తూ) కారడవుల కఠినజీవనాన్ని కమనీయప్రాసాదభోగంగా మలచకల్గిన తమ రుబా యీలు, సూర్యకిరణాలుకూడా స్పృశించలేని మెడద

లోతులను తాకి నా తనువు పులకరింపచేస్తున్నయ్.
ఆనంద వివశనై ఆలసించినందుకు మన్నించండి,
ఖయ్యాం! (పానపాత్ర అందిస్తుంది)

ఖయ్యా:- (పానపాత్ర అందుకొంటాడు) మధుపాత్ర చేబూని
నాకై నడచివచ్చు సుందరమందగామినివి. నీలాంటి
అందగత్తె లెందరో ఈచోట మన్నైపోగా ఆ మట్టి
నుండి ఈ పచ్చనిగడ్డి మొలకెత్తిందో అని జాలిపడి
మెల్లగా నడుస్తున్నావా సాఖి!

ఈ తరుశాఖనీడల చెలీ! ఒకరొట్టెయు, పానపాత్రలో
ప్రాతరుషోదయారుణవిలాసము జిందెడి ఆసవమ్ము, నా
కైతల పుస్తకమ్ము తమకమ్ముల రేపుచు పాడియాడు నీ
చేతలు సేయవా విపినసీమల స్వర్గ మనోజ్ఞవాటిగా ॥

ఈ ఉదయారుణరక్తిమలోని ఉజ్జ్వల సౌందర్యాన్ని
సందర్శించేభాగ్యం నిదురపోతులకేలా లభిస్తుంది,సాఖి!
పైగా తమతోటి ప్రొద్దుపొడిచినట్లు భావిస్తారు...
చిమ్మచీకట్లు చెదరిపోగా మందమలయానిలం విసరిన
దిఙ్మణి దివ్యదీప్తులకు తారకలు వెలవెల మన్నై.

అదిగో! యుషఃకుసుమ గగనాంగణమందుననిల్చి పిల్చె మీ
నిదురలు మాని రండు, రమణీయప్రవారుణి త్రాగిపొం డిదే
యద నిక జీవనార్ద్రమధువంతయు గిన్నెలనింపు డింకిపో
నిడ మది జాగుసేసిన ఫలింపదు జన్మ మరెన్నినాళ్ళకున్॥

సాఖి:- కలకాలం మన గాఢానురాగానికి అంతరాయ మాపా
దిల్లకుండాఉంటే నాజీవితం ధన్యం ఖయ్యామ్! కాని,

ఖయ్యా:- ఆ అనుమానానికి కారణం?

సాఖి:- క్షణమైకజీవనమాత్రమైన మనిషి ప్రస్థానములజీవితం, మహా విఖ్యాతి గడించిన దాత హాతింతాయి ఆఖరికి తిండికై విలపించిన దీనదశ, శౌర్యశీలవీరుడైన రుస్తుం భుజబలం సన్నగిల్లినసంగతి జ్ఞప్తికివచ్చినప్పుడు మనం. మన ఆనందం శాశ్వతమే నంటారా?

ఖయ్యాం:- గతి గాథల్ని త్రవ్వబోకు, సాఖీ! అందుకు వగచి దినదినం భీతితో బెంగతో జీవించటంకన్నా బ్రతికిన నాలుగునాళ్ళు ఆటపాటలతో ఆనందడోలికల్లో సుఖ జీవనం గడుపుదాం. తను నిర్మించిన ఈ సుందరజీవి తాల్ని పునర్నిర్మాణంపాలుచేసి దుమ్ములో కలుపనెంచుతాడా, అల్లా. అందుకు మనమే బాధ్యులమేమో?

సాఖి:- మానవసహజమైన దౌర్బల్యాన్ని దుఃఖాన్ని త్రోసి పుచ్చలేముగా ఖయ్యాంజీ!

ఖయ్యాం:- అల్లా సదా ఆనందమయుడు. మనమూ నిత్యానందమయులమై జీవించటం నేర్చుకొన్ననాడే అల్లా బిడ్డలమని చెప్పుకోగల్గుతాం. ఆనాడే తనూ గర్విస్తాడు. అమృతంలాంటి సురాపానాన్ని ఆ అల్లా ప్రజ్ఞకు హారతిస్తున్నావు. అతడి సృష్టిలోనిదేఅయిన విషాన్ని నిరసించటం అల్లాని అగౌరవించటంకదూ?

సాఖి:- కష్టాల్ని నవ్వుతూ అనుభవించినట్లే విషాన్ని మధువుగా స్వీకరిస్తారు తమరు — ఖయ్యాంజీ! కాని మధుపానలోలురని మతప్రవక్తలు, వేదాంతులు నిందిస్తారే— దాని కేమంటారు, ఖయ్యాంజీ?

ఖయ్యా:- శుష్క వేదాంతాల సూత్రాలతో వారంతా రేపో మాపో ఉరిపోసుకొని కన్నుమూస్తా రంటాను. సంతృప్తితో సంతోషోత్సాహంతో నేనూ మరణిస్తాను. వారు నాకంటె గడించే దేమీ లేదు. నా జీవన మానవుని బ్రతికిన నాలుగునాళ్ళు తృప్తిగా బ్రతుకుతాను. అప్పైనకూడా-

ఏ మరణించినా గమపడి శవ మాసనమందు ముంచి, నన్
భూమిని పాతిపెట్టుతరి బోయెడు వాకుడ్, మట్టినుండి ఖ
య్యామును పానపాత్రగ దయాగొనరింపుడు, నింపు డాసవం
బో మది రేక్షణా ! పలుకకుండునె నాకు సజీవనుండనై ॥

సాకీ:- అల్లా! అశ్లీలం. తమమట్టితో పానపాత్రలు తయారు కావాలంటారా ! ఇక చాలించండి, ఖయ్యామ్ !

ఖయ్యా:- సాకీ !

అల 'జమషీదు' - కైకుడమి మొదలనేలిన వారి శక్తి యే
తలమున గుల్కెనో యచట తత్కథ రూపరి పోసివంగులో
మెలుగుచు గ్రుమ్మరెన్! మృగము క్రోయు పరాక్రమశాలి బైరమీ
ఇలపయి గూల గార్దభములెన్ని చరించెనో తచ్ఛిరమ్ముపై ! ॥

పానపాత్రనై పోతానన్న నామాటకే కోపం వచ్చిందా సాకీ!

వరము గిరమ్ము లన్నియును నట్టివి గట్టిగ నాల్గునాళ్ళు నీ
సుమచిర హాసలుబ్ధముల జొక్కుచు నీసెలయేటి పాటలన్
గరగెద నమ్ము లోగొనుము కాటుకకన్నులు చిన్నిబుగ్గపై
మెరసెను స్పష్టమచ్చ యతివా! మధురస్మృతి రేపుమా హృదిన్॥

ముగ్గురాలు— సమాజాలలో నా మనస్సుకట్టి వేసిన ప్రేయసిని, సాఖీ!

సాఖీ:- మాయిూన్‌జీ! ప్రాతఃకాలపు నమాజుకై జనం వెళ్తున్నారు. తమరు ఈ విలాసాలతోనే—

ఖయ్యాం:- అల్లా నాకు ఏలోటు కల్పించాడని అతణ్ణి ప్రార్థనలతో పీడించమంటావు, సాఖీ! ఆ నమాజుబదులు ప్రకృతికి నిండా మధుపాత్రావిన్యాసాల నమస్కరిల్లుతాను.

సాఖీ:- ఖయ్యాంజీ! మనం వేరువేరుగా ఎందుకు జన్మించాం?

ఖయ్యాం:- ఇదువరకం ఏకమైయున్నాము ఈ విభిన్నత్వం కలిగియుండవచ్చు. నీవు సురాభాండాన్నందివ్వటానికీ నేను దాన్ని పుష్కలంగా త్రాగటానికీ జన్మించాం. ఈ విభిన్నత్వంమీద వెగటు జన్మించినప్పుడు ఏకమైపోతాము.

సాఖీ:- (అటు చూస్తూ) అదుగో తమశిష్యుడు ఉరూజీ వస్తున్నట్టుంది. (కొంత దూరంగా నిలబడుతుంది)

ఉరూజీ:- (ప్రవేశం. విచారంగా ఉంటాడు.)

ఖయ్యాం:- రా, నాయనా, ఉరూజీ! ఏం? ఏదో విచారంగా కనబడుతున్నావ్?

ఉరూజీ:- నిన్నటితమ ప్రవర్తన నాకు చాలబాధ కలిగించింది, మాయిూన్‌జీ! దానివల్ల నగరంలో తమర్ని హేళనగా మాట్లాడుతున్నారు.

సాఖీ:- హాసన్ అనుచరులై ఉండొచ్చు.

ఖయ్యాం:- (నవ్వుతూ) ఏమని ఉరూజీ?

ఉరూజి:- ప్రేయసీమధువులతో ఖయ్యామ్ దివానా అయినా
డని-

ఖయ్యాం:- నన్ను వరించిన ప్రేయసిలాంటి అందగత్తె, నాకు లభించే మధువు దొరికిననాడు- ఈ ప్రజలు - వారూ నాకంటే పిచ్చివాళ్లైపోతారు. ఇప్పుడు వాళ్ళకంటే నే నెంతో అదృష్టవంతుణ్ణని గర్విస్తున్నాను.

సాకి:- దేనికీ ? దివానా అన్నందుకా ?

ఖయ్యాం:- నీ సౌందర్యం నన్ను ఉన్మత్తుణ్ణి చేసినందుకు.

సాకి:- (సిగ్గుతో తలవంచుకుంటుంది)

ఖయ్యాం:- ఆఁ, ఇంకా ఏమన్నారు, ఉరూజీ ?

ఉరూజి:- ఖయ్యాముకు పిచ్చెక్కి జ్ఞానం నశించిం దన్నారు. మిమ్మల్ని నా చిన్నమాటలకు నా కెంతో బాధ కలిగింది.

సాకి:- వారలా అంటానికి అసలు కారణం ?

ఖయ్యాం:- తెలిసింది. నీ విచారం దేనికో నా కర్థమైంది ఉరూజీ. సాకీ, నిన్న నేను సొట్టపోయిన ప్యాలీని కుమ్మరిదగ్గర ఖరీద్ చేసి తెచ్చాను.

సాకి:- అవును.

ఖయ్యాం:- అదే ఉరూజీకి కోపకారణం.

సాకి:- ఉరూజీ కోపగించారు. నే నప్పుడే అన్నాను.

ఖయ్యాం:- మరోమారు ఖయ్యామ్ దివానా అన్నారు

ఉరూజి:- పగిలిన పాత్రల్ని ఖరీద్ చేసే పిచ్చివాడు మా ఖయ్యామ్ అని అపహాస్యం చేశారు. నేను మంచి ప్యాలీని తీసిఇవ్వబోతే వద్దన్నారు. కుమ్మరికి ప్రతి

సంకోచాలా లెక్కచేయమా అన్నలేదు. ఈలా ఉపే-క్షచేయకండి షాయార్‌జీ!

సాకీ:- క్షమస్వ. మిమ్మల్ని ఎవరెన్నా నిరసనగా ఒక్క-మాటన్నా ఉమర్‌జీ సహించలేడు. అతడిబాధ గుర్తించండి.

ఖయ్యా:- నాయనా, ఉమర్‌జీ - ఇతని ఆటే ఆ పాత్ర! (అంటూ చూపుతూ)

ఏ నటునుండి వచ్చెతరి హీన రవమ్మున జాలిగొల్ప క్షే
దాన వహించె పాత్ర యది - 'త్రాగినమత్తున సొట్టగొట్టలో
కానికి హాస్యపాత్రముగ గల్పనసల్పిన కుమ్మరీ! నను
గానవా! ముద్దులొల్కు నిగారపుకుండలదండ నుండగన్' ॥

ఈభావన నాహృదయాన్ని కలచివేసింది. ఖరీద్ చేశాను. నిన్ను బాధపెట్టాలని నాఉద్దేశ్యం కాదు. ఉమర్‌జీ! ఆపాత్రను తయారుచేయటానికి ఉపయోగించినమట్టి ఏ పాదుషాదో అయివుండవచ్చుకూడా -

ఈ నిఖిలావనీతలము నేలిన దివ్యయశస్వియౌ షరీ
మానుశిరమ్ము గాంచు మదె మన్నయిపోయెను లెమ్మతప్పునే!
తానొకనాడు పానపుల సుధామధుధారల జొక్కి సోలియున్
దీనత కుమ్మరినికడ తీవ్రపదాహతి నొందు మట్టియై॥

ఉమర్:- క్షమించండి ఖయ్యామ్‌జీ! తమ నర్థంచేసుకోలేక పోయినాము.

ఖయ్యా:- విచారించకు ఉమర్‌జీ!

సాఖీ:- సొగసైన ప్యాలీని త్రోసివేసి సొట్టపోయిన పాత్రల్ని ఖరీద్ చెయ్యటం సౌందర్యోపాసకుల అంతర్యం కాబోలు! అది మన కేలా అర్థమవుతుంది ఉరూజీ! (నవ్వుతుంది)

ఖయ్యా:- (సాఖీతో) నీవు సృష్టిసౌందర్యానికి మకుటానివే కావచ్చు. కాని - సాఖీ!

ఒకనా డీవును మట్టిలో కలసిపోనున్నావి లే కుంభకా
రకుడో వచ్చి, త్వదీయమృత్తిక వికారమ్మైనపాత్రమ్ముగా
నెకసక్కెమ్ముగ జేయబోవడో కటా! హీనమ్ముగా దీని దూ
రకుమీ, పాత్రలమంచిచెడ్డలకు కర్తల్ బాధ్యులై యుండరా?

సాఖీ:- తమకు చెప్పగలదాన్నా ఖయ్యామ్‌జీ! తమరు చెప్పేది నిజమని ఋజువు చెయ్యటానికి ఇంతకుపూర్వం మీరు చెప్పినట్లే ఎన్నో జరిగినాయి షాయీర్‌జీ!

ఉరూజి:- అవును - పూర్వం 'సదరుద్దీన్ మహమ్మద్ బిన్ ఉల్ ఫజర్' పాదుషా షికారుకు పోబోతున్న సమయంలో ఆకాశంలో మేఘాలు కమ్ముకున్నవి. వాన వస్తుం దేమో అని భయపడినారు. అప్పుడు తమరు, అయిదు రోజులదాకా వర్షం వచ్చేది లేదన్నారు. అదేరీతి జరిగింది.

రుస్తుం:- (ప్రవేశం) సలాం. సలాం.

సాఖీ:- ఎవరు నువ్వు.?

ఉరూజి:- పాదుషా ప్రధాన సేవకుడు రుస్తుం.

రుస్తుం:- (ఖయ్యామ్‌తో) షాయీర్‌జీ, పాదుషా తమకు స్వాగతం చెబుతున్నారు.

సాఖి:- ఇది మాయోపాయం. ఆనాడు హసన్ వెళ్తూ తమ మీద పగసాధిస్తా నని బెదిరించాడు. అతడిదృష్టికి మీరు మతద్రోహి. ఇంతలో ఇంత అకారణ గౌరవభావం కల్గటానికి కారణం ?

ఉమరాజి:- ఇది నమ్మదగ్గవిషయం కాదు.

సాఖి:- అవును ఖయ్యామ్‌జి ! వెళ్ళకండి.

ఖయ్యా:- (నవ్వుతాను) సాఖి, ఉమరాజి-రు స్తుంవచ్చిన సంగ తేమిటో పూర్తిగా చెప్పనేలేదు. అనుమానించదగ్గ విషయమైనా, అతడుచెప్పేది మనం పూర్తిగా వినాలి.

రుస్తుం:- (అతివినయంగా) అనుమానించకండి షాయిూర్‌జీ! మొదట్లో తమ ప్రతిభ తెలియక పాదుషా తమను దూషించినాడు. కాని బేగం సాహేబా తమవిలువ ఏమిటో తెలియజేసింది.

ఖయ్యా:- బేగం సాహేబాకు నన్నుగూర్చి ఏం తెలుసు?

సాఖి:- (నవ్వుతుంది)

ఉమరాజి:- రమ్మన్న కారణం?

రుస్తుం:- బేగంసాహేబాకు, పాదుషాకు మతవిషయంపైన వాగ్వివాదం వచ్చింది షాయిూర్‌జీ! అందులో బేగం సాహేబా తమపక్షం ఉన్నారు. పాదుషా మాల్వీపక్షం ఉన్నారు. మాల్వీసాహేబ్‌కూ తమకూ మతచర్చ జరుగుతూంటే బేగంసాహేబా, పాదుషాలు చూసి -

సాఖి:- వినోదిస్తారు. అంతేనా? వెళ్ళకండి ఖయ్యామ్‌జి! దగాచేసి ద్రోహంతలపెట్టవచ్చు. రుస్తుం! చెప్పు,

'పాదుషా పిలవనంపితేవచ్చే శానిసకాడీ ఖయ్యామ్'
అని మీా పాదుషాతో చెప్పు.

ఖయ్యా:- సెహబాష్! ఖయ్యామ్ ఆత్మగౌరవం నిలబెట్టే మాటన్నావు, సాఖి!

ఉరూజి:- రుస్తుం! ఇంకా నిలబడి చూస్తావేం?

ఖయ్యా:- ఆగు, రుస్తుం... ఉరూజీ! మతవిషయికమైనవాగ్వివాదంవచ్చినప్పుడు మనం వెనుకంజవెయ్యటం ప్రత్యర్థులు మనఓటమిగా భావిస్తారు. పాదుషా వినోదంకోసమేఅయినా ప్రజలందరికీ సత్యం నిరూపించవచ్చు... రుస్తుం! అనుమానాలతో భయపడేవాడుకాడీ ఖయ్యామ్. పద, వస్తున్నాం.

*ముందు రుస్తుం దారిచూపుతాడు, ఖయ్యామ్ వెళ్తాడు.*

సాఖి:- ఉరూజీ! నువ్వూ వెళ్ళు. ఏ ఆపదా రాకుండా చూడు- వెళ్ళు ఉరూజీ!

ఉరూజి:-మంచిదమ్మా - వెళ్తాను...

*ఉరూజీ వెళ్తుండగా తెర*

# ఉమర్ ఖయ్యామ్

## పదవ రంగము

హాకిరామందిరం. వజీర్, మౌల్వీ ప్రవేశం

వజీర్:- మౌల్వీసాహెబ్! మనసర్కారుకు సిపాయీలు ఇచ్చిన ఎకుడం ఏమిటి?

మౌల్వీ:- సైకుల్ జహాల్ కోహస్తాన్, నబియుల్ హిలాకత్ -

వజీర్:- దాని అర్థం?

మౌల్వీ:- చావును పంచి స్వర్గంని చూపించి.

వజీర్:- బహుత్ అచ్ఛా, బహుత్ అచ్ఛా! సర్కార్ హుకుం ప్రకారం ఇంతఅందమైనకోట కట్టించాను. జన్నత్ సుఖంఅంతా ఇక్కడ పెట్టినాను. అందమైన చిన్న పిల్లల్ని పట్టితెచ్చి మనజన్నత్ నౌకర్లుగా పెట్టినాను. కాని నాకు తమకు ఏమీబిరుదు ఇవ్వలేదు. నాకు కూడా -

మౌల్వీ:- అరె! తమకు దేనికి. ఇదంతా సర్కార్ చెప్పినారు, మీరు చేసినారు.

మౌల్వీ:- సర్కార్ హుకుంఅంతే. కష్టపడింది నేను. కష్టపడ్డ వాడికి మంచిబిరుదుఇవ్వాలా వద్దా, తమరేచెప్పండి.

మౌల్వీ:- అవును, వజీర్ సాహెబ్. నిజం. మీకంటె గోడలు కట్టినవాళ్ళు ఎక్కువకష్టపడ్డారు. చెమటలుకారేలా

పని చేసినాను. మీది హుకుంమాత్రం ఉంది. ముందు వాళ్ళకి బిరుదు ఇవ్వాలి. ఆపైన తమకి...

వజీర్:- మౌల్వీసాహెబ్! మీరు వెక్కిరిస్తున్నారు. పోనీయండి. నాకు బిరుదుల్ ఏమీ వద్దు. ఇంతవరకూ ఖుషీగా -

మౌల్వీ:- పెండ్లిఅయిందిగా యెప్పుడో తమకు.

వజీర్:-అయింది. కాని మా పెండ్లాంకు నేనంటేనే కోపం. బతిమిలాడి ఓ సాయంకాలం తోటలోనికి తీసుకు పోయినాను.

మౌల్వీ:-మరి ఒప్పుకుందా? బలవంతంగానా?

వజీర్:-ఒప్పుకుంది. ఖయ్యాం సాఖీలమాదిరి తోటలో హాయిగా జల్సాచేద్దాం అని చెప్పితే సమజ్ అయింది.

మౌల్వీ:- మీరూ, తాగుతారూ?

వజీర్:-లేదు, మౌల్వీసాహెబ్ - కొంచెంకొంచెం- అప్పుడప్పుడూ మా పెండ్లాం బలవంతం చేస్తే...

మౌల్వీ:- అరె, మాకీ పెండ్లాం ఉండాదీగానీ వజీర్ సాహెబ్- బహుత్ బుడ్డీ హోగయా. మీ జనానా చిన్నది ఉండచ్చు. అందుకని పాపం మనస్సుపడ్డది.

వజీర్:-సాఖీ ఖయ్యామ్‌కు మధువు అందించినట్లు నాకూ మధువు అందించుతానన్నది. నన్ను కవిత్వం చెప్పమన్నది. పాడమంది మౌల్వీసాహెబ్!

మౌల్వీ:-పాడినారూ వజీర్ సాహెబ్!

వజీర్:-ఖయ్యాంలాంటిమొగుడు దొరకలేదని ఎప్పుడూ ఏడుస్తుంటాది. ముద్దూముచ్చటాలేక ఎప్పుడూ కొలువు

చేస్తావ్ అని కసరి కొట్టింది. అందుకని పాడక తప్పింది కాదు.

మౌల్వీ:- పాపం! మీరు చెప్పిన కవిత్వం ఏదీ- మేమూ వింటాం-

వజీర్:-హూషార్ సే లడ్‌కే-సే ఖుషీ మనానా
దిల్ మె బుల్‌బుల్ పిట్ట గానా బజానా
పీనా, ఖానా, హమేషా, జల్సా సే మన్నా
కవిత సెప్పే హంబీ ఖయ్యామ్ హో జానా॥

మౌల్వీ:-వహ్వా, వహ్వా!

వజీర్:-మనసర్కార్ ప్రచారం చేసేమతంకు మనందరం మద్దత్ ఇస్తున్నారు. కాని దానివల్ల ఆనందం దొరకటం లేదు. మౌల్వీసాహేబ్!

మౌల్వీ:-దొరుకుతుంది- దొరుకుతుంది. హసన్‌బిన్ సబాహ పాదుషా అధికారంలో మతప్రచారం చేస్తున్నారు. అది మూఢవిశ్వాసాలతో కూడింది అని ఖయ్యాం అంటాడు కాని-

వజీర్:-హసన్‌బిన్‌సబాహ అన్ఫర్ ఉమర్‌ఖయ్యామ్ ఒక్కచోట చదువుకున్నవాళ్లు. ఖయ్యామ్‌కు మన పాదుషా తెలివితేటల్లో యేమీ తీసిపోడు. మనిషికి దుఃఖం లేకుండాచేసే మతం అంటాడు.

మౌల్వీ:- దాన్ని ప్రచారంచెయ్యటానికి మనం ఉన్నాంగా.

వజీర్:_ మనం పాదుషామతం త్వరగా ప్రచారంచెయ్యాలి. ఆడవాళ్ళంతా ఖయ్యాంచెప్పే రుబాయీలు విని అత

డికి లొంగిపోయి ఆ తత్వం మంచిదని మనమాట వింటంలేదు మౌల్వీసాహెబ్!

మౌల్వీ:- మీజనానాకూడా ఆరకంగాఉందా వజీర్‌సాహెబ్!

వజీర్:- మనం ఎట్లాచెబితే అట్లా మా జనానా -

మౌల్వీ:- మీరు వజీర్‌గావచ్చింది మొన్నమొన్నచే. అంతకు ముందు మీరు, మీజనానా -

వజీర్:- అరె, అంతకుముందు నాసంగతే ఏమిటి? (మెల్లగా) మనసర్కార్ - తమరు?

మౌల్వీ:- నై, నై, మేం మంచిమర్యాదాకలవంశంలో పుట్టి నాము. మాఆడవాండ్లు ఖయ్యాముకవిత్వానికిలొంగరు.

వజీర్:- మా ఆడవాళ్ళూ లొంగరు. అయినా మనం హుషార్‌లో ఉండటం మంచిది. ఖయ్యాముకు నీతి లేదు. అతడి రుబాయిచదివేవాళ్ళని కఠినంగా శిక్షించ వలసిందని పాదుషా హుకుం. అది అమలుజరిపినామ్.

మౌల్వీ:- బహుత్ అచ్ఛా, బహుత్ అచ్ఛా... పసందైనపని చేసినారు.

*బైటనుంచి ఎవరోవస్తున్నట్లు వజీర్ గమనిస్తారు.*

వజీర్:- మౌల్వీసాహెబ్! ఆలంపనా-

మౌల్వీ:- ఆ, ఆఁ! వస్తున్నారూ?

హాసన్:- (ప్రవేశం. వజీర్, మౌల్వీ ఇద్దరూ వంగివంగి సలాంచేస్తారు) వజీర్! రుస్తుంచేత ఖయ్యాంని పిలిపి స్తున్నాం. అతడువచ్చేదారిలో రుబాయీలు నిత్యం ప్రచారంచేసేవాళ్ళని కఠినంగా శిక్షించండి. ఖయ్యామ్

ఇది కళ్ళారా చూడాలి. లోనికి ఖయ్యామ్‌ని ఒక్కణ్ణే పంపండి. ఏమంటారు మాల్వీసాహెబ్ ...

మాల్వీ:- అవును. ఖయ్యామ్ ఒక్కడే మనతో వాదించటానికి రావాలి. వెంబడే శిష్యులు వస్తే -

వజీర్:- తమరు ఒక్కరే అయిపోతారు.

హసన్:- కాదు. మాల్వీసాహెబ్‌కి మద్దత్‌గా మేమూ ఉన్నాం.

వజీర్:- అచ్ఛా, అచ్ఛా!

హసన్:- అయినా ఖయ్యామ్‌ని ఒక్కణ్ణే ప్రవేశపెట్టండి.

వజీర్:- జీ. (వెళ్తాడు.)

హసన్:- మాల్వీసాహెబ్! కుస్రూ దొరకలేదు. వాణ్ణి పట్టితెచ్చి ఖతంచేస్తేగాని మా మనస్సుకు శాంతి ఉండదు. వాడు-

వజీర్:- తమ దుష్మన్ కొడుకు.

హసన్:- ఖయ్యామ్ వాడిని ఎక్కడో దాచినాడు, మాల్వీ సాహెబ్!

మాల్వీ:- ఈ జన్నత్‌లో వాడిని గుల్మాన్‌గా నియమించి -

హసన్:- దుష్మన్ కొడుక్కు ఇక్కడ తావులేదు. వాడితండ్రి నిజాముల్ముల్క్ నాకు ద్రోహంచేసినాడు. ఖయ్యామ్ మీద పక్షపాతం చూపినాడు. (ఆవేశపడతాడు)

మాల్వీ:- అయినా తమకు తక్కువేముంది, ఆలంపనా! సిరియాకుపోయి గొప్పమతప్రవక్తగా పేరుగడించుకొన్న మీకూ గౌరవం ఉంది. ఇస్మాలియీలు, మేం తమరు చెప్పినట్టు నడుస్తున్నాం. తమరుకట్టించిన ఈ అందమైన

కోటలో- ఈకొండలోయలో - ఈతోటల్లో జన్నత్ నిండిఉంది. మనస్సుకు మంచిఆనందంఇస్తయ్యి ఇవి.

హాసన్:- లేదు. అదే లేదు. మనస్సుకు సంతోషమన్నదే లేదు. అఖండైశ్వర్యం ఉంది. మేమూ పాదుషాలమే. అంతే కాదు. గొప్పమత ప్రవక్తలం. అల్లాని అనుక్షణం తలుస్తాం. కాని మనస్సుకు శాంతి లేదు. కారణం తెలియదు. (భంగ్ త్రాగుతాడు)

మాల్వీ:- ఆఁ, అది మనస్సు సరిచేస్తుంది. మెదడుకి హుషార్ ఎక్కిస్తుంది. ఖయ్యామ్ కష్టాలు మరచిపోవటానికి మధువు త్రావుతాడు, అంతే.

హాసన్:- ఆ మధువు సాకిఅందిస్తే పసంద్ కదూ?

మాల్వీ:- నిజం, నిజం సర్కార్ - కాని అల్లాంటితత్వం తమది కాదుగా జహాపనా !

హాసన్:-కానీ - సాకీ చాలఅందగత్తె మాల్వీసాహేబ్ !

మాల్వీ:-అరె, ఆమాట నాకు తెల్వదు. ఆమె షోసనీ పువ్వు మాదిరి ఉంటుంది. ఆమెనవ్వితేనే బుల్‌బుల్ పిట్టకూసినట్లు శరీరంఅంతా ఝుల్‌ఝుల్ మంటుంది జహాపనా! ఆల్లాంటి అందమైన లడ్కీని ఫకీర్‌కి ఇచ్చినాడు, ఆ అల్లా! దూత్! అల్లా బిల్‌కుల్ పాగల్ హై.

హాసన్:-మాల్వీసాహేబ్! చెప్పండి-మాకు మంచికిస్మత్ ఉందంటారా?

మాల్వీ:-చెయ్యిచూపండి జహాపనా!(హాసన్ అరచేయిచూపి) వహ్వా- వహ్వా! హాసన్‌బిన్‌సబాహాపాదుషాకు అదృ

ష్టంపట్టింది. అదృష్టం. సాక్షి మీకు దక్కేది ఉంది.
మీ గీత బహుత్ అచ్ఛా హై-

హాసన్:-(ఆనందంగా నవ్వుతాడు. అంతలోనే ఏదో జ్ఞాపకం వచ్చి కోపంతో పండ్లుకొరుకుతాడు) ఖయ్యామ్ అహ్హాహ్హా! (బైట వజీర్ హుకుం ప్రకారం ఖయ్యామ్ అనుచరులను రాజసేవకులు కొడుతుంటారు. ఆర్తనాదాలు వినపడతై) విన్నారా మాల్వీసాహేబ్! అదిగో -

మాల్వీ:- అవును, జహాపనా! రుబాయత్ చదివేవాళ్ళని దండిస్తున్నారు. అంతేకాదు, ఖయ్యామ్ నాల్క కోయించాల. అప్పుడుగాని-

హాసన్:- మామాటకు లొంగకపోతే, ఆపనీ చేయిస్తాం-

మాల్వీ:- ఇక పార్సీపండితులు ప్రాణాలుతీసుకుంటారు.

హాసన్:- ఉర్దూ అరబ్బీలకు ప్రాముఖ్యం ఇస్తాం...

మాల్వీ:- ఇక రుబాయత్ వినపడరాదు..

*బైటనుంచి పద్యాలు వినపడుతుంది.*

ప్రతిదినమ్మును సురాద్రావి బ్రతుకుమోయి!
శుక్రవారనిషేధమే వక్రబుద్ధి
వారముల కీవు భక్తుడ వైతి వయ్యో!
ఈశ్వరునిమీద భక్తి నశించె సేకు॥

హాసన్:- (ఆగ్రహంతో పండ్లుకొరుకుతూ) బేవకూఫ్!

మాల్వీ:- ఖిలాఫ్ !

*ప్రజల రోధనధ్వనులు వినపడతై*

హసన్:- (వికటంగా నవ్వుతాడు) మాల్వోసాహెబ్ - ఆ. ఇంతకుముందు నాకుఅదృష్టంపడుతుం దన్నారుకదూ! అదితమరుచెప్పకపోయినా, యథార్థం మాకు తెలుసు.

మాల్వో:- అవును, అవును. (చేసేదిలేక కొద్దిగానవ్వి వూరు కుంటాడు)

హసన్:- అది మా కెట్లా అంటారుకదూ' సునో! చిన్నతనం లో ఈనైషాపూర్‌లోనే ఇమాంసాహెబ్ వద్ద చదువు కున్నాం, నేనూ నిజామ్ ఉల్ ముల్క్-.

మాల్వో:. తమరు ఖతంచేసిన-

హసన్:- ఆఁ, హాఁ! ... అవుర్ ఉమర్ఖయ్యామ్ ఇమాం సాహెబ్ వద్ద చదివినవాండ్లకి మంచికిస్మత్ ఉంటుందనే వారు. నిజామ్ఉల్ ముల్కు ఆలిప్ ఆర్సలాడ్ వద్ద వజీరుగాఉన్నప్పుడు ఖయ్యామ్, నేనూ అతణ్ణి కలుసుకున్నాం. మాముగ్గురిలో ఎవరికి అదృష్టంపట్టినా ఇతర్లని పైకితీసుకురావాలని ఓ షరత్ ఉండేది మాచిన్న తనంలో. కాని నిజామ్ఉల్ ముల్కు ఖయ్యామ్‌యందు పక్షపాతంచూపి మమ్మల్ని లెఖచెయ్యలేదు. నేను మాలిక్‌షావద్ద ఉన్నప్పుడు నామీద వాడు షికాయత్ చేసిన సంగతి మీకూ తెలిసిందేగా మాల్వో సాహెబ్!

మాల్వో:- ఖయ్యామ్‌కు, నిజామ్ఉల్ ముల్కుకు, మాలిక్‌షాకు బహుత్ దోస్తీ ఉండేది. వాళ్ళిద్దరూ బ్రతికిఉన్నంత కాలం ఖయ్యామ్ ఇష్టంవచ్చినట్లు ఆడినాడు. తమకు

తఖ్తు నెక్కిందిలగాయతు మాకు ఖుషీగా ఉన్నాం. అల్లా చల్లంగా చూస్తాడు మిమ్మల్ని, జహాపనా!

రుస్తుం:- (ప్రవేశం) సలాం, సలాం.

హాసన్:- ఖయ్యామ్ ఎక్కడ?

రుస్తుం:- వస్తున్నాడు. రుబాయ్ చదివేవాళ్ళని శిక్షిస్తుంటే దారిలో ఆగి మన నౌకర్లని ఇది యెవరి హుకుం అని అడుగుతున్నాడు.

మాల్వీ:- వజీర్ సాహెబ్ ఉన్నారా?

రుస్తుం:- ఉన్నార్. ఖయ్యామ్‌తో మాట్లాడుతున్నారు.

హాసన్:- మంచిది. నువ్వు వెళ్ళు రుస్తుం. (రుస్తుం వెళ్తాడు) మాల్వీసాహెబ్! ఎట్లా ఉంది వుపాయం.

మాల్వీ:- మంచిగా పిలిపిస్తే రాడుగా సర్కార్! అందుకని-

హాసన్:- మతద్రోహి – మధువు తాగి మత్తెక్కి మాట్లాడే ఖయ్యామ్‌ని మీముందు నిలబెడతాం. మీరు వాదంలో అతణ్ణి పట్టికొట్టించాలి.

మాల్వీ:- అరె, అది యెంతపని జహాపనా! ఏశాస్త్రంలోనైనా సరే, ఖయ్యామ్‌ను ఒక్కనిమిషంలో గుక్క త్రిప్పుకోకుండా చేస్తాం. మక్కాలో మాద పాండిత్యం చూచి హుక్కిరిబిక్కిరైనార్ సర్కార్.

హాసన్:- ఎవరు, చదువుకున్నవాళ్ళేనా మాల్వీసాహెబ్!

మాల్వీ:- హాం. పెద్దపెద్దవాండ్లు. ఈ ఖయ్యామ్ ఉన్నాడే మక్కాకిపోయివచ్చిందిమొదలు మధువు తాగటం జాస్తిఅయింది. దారిలో సాఖీకి లేవదీసుకొచ్చినాడు.

హాసన్:- మక్కాకిపోయి మంచిమనస్సుతో రావాలిగాని, మధువుత్రాగటం నేర్చుకొని కాదు. జిందగీకి దుష్మన్ అయిన మధువు త్రాగే ఖయ్యామ్‌ని -

ఖయ్యా:- (వీళ్ళసంభాషణలోని పైమాటలు వింటాడు. చిన్నగా నవ్వుతూ ప్రవేశిస్తాడు) హాసన్ -

సుర ఒకశత్రువేని మది జొక్కుచు బీల్చెద దానివెచ్చ నె
త్తురు గడుపారగా బరునిదూల్చుట ధర్మనిబద్ధమేగదా!,
పరమునకై తపించి సుర పాపమటంచు దలంచువారి ను
ద్ధరణముసేతు - మీకును సుధాకలశమ్ముల నెత్తి త్రాగుడీ॥

హాసన్‌బిన్‌సబాహకు ఆశీర్వాదం!

మాల్వీ:- అరె, ఆశీర్వాదంచేస్తావ్ సర్కార్‌కు.

ఖయ్యా:- మీ మోస్తరు గులాంని కాదు, సలాం చెయ్యటానికి.

మాల్వీ:- ఏమ్టి? మాకి గులామ్ అంటావు!

ఖయ్యా:- (తానై కూర్చుంటూ) హాసన్! నా రుబాయత్ చదివేవాళ్ళని కఠినంగా శిక్షించమని హుకుంజారీచేశావట. నిజమేనా?

హాసన్:- (కోపంతో మాట్లాడడు)

మాల్వీ:- అక్కడ నౌకర్లకి అడగలేదూ?

ఖయ్యా:- వాళ్ళు జవాబ్ చెప్పలేక మౌనంవహించారు. మీరూ అంతేనా హాసన్!

హాసన్:- నైన్హా. జవాబిస్తాం. ముందు మా సవాల్‌కి జవాబివ్వాల నువ్వు.

ఖయ్యాం:- తయ్యారుగా ఉన్నాం. అడగవచ్చు.
హాసన్:- మాల్వీసాహెబ్!

మాల్వీ:- (కుంటుతూ ముందుకు వస్తాడు) అచ్ఛా, అచ్ఛా. మీరు కొన్ని కవిత్వాలు మేం. ఆచారవిరుద్ధంగా ప్రచారం చేస్తున్నారు. అల్లాను దూషిస్తున్నారు. నమాజు చద్దని మధువు తాగి మత్తెక్కి అందమైన లడ్కీలతో జల్సా చేస్తున్నారు. ఇది మేం సహించం, ఖయ్యామ్!
ఖయ్యాం:- ఆచారవిరుద్ధం! ఆ ప్రశ్న, హాసన్-

రసికత నేర్వజాలని పురాతన కాంత యదెంత భక్తిగా
మసలిన గాని నా మనసు మారక నాడె విడాకు లిచ్చితిన్,
కొసరితి కన్న లోగొనిన కోమలి ద్రాక్షలతాకుమారి మో
వి సుకమె, క్రొత్త పెండ్లితల పెట్టితి వేడుక నా గృహంబునన్॥

ఇదేనా నావల్ల జరిగిన నేరం, హాసన్?

హాసన్:- ముస్లిమ్‌తో కలసి మామీద కుట్ర చేస్తున్నావు. ఖయ్యామ్! సచ్ఛీలవర్తనమాచరించుంటే మన్నిస్తాం- లేకపోతే-
ఖయ్యాం:- లేకపోతే ఖతం చేస్తావ్. అంతేకదూ హాసన్! అవును, మాలిక్ షా — కాని, అది ఇప్పుడప్రస్తుతం- (మాల్వీతో) మాల్వీసాహెబ్!
మాల్వీ:- హాఁ!
ఖయ్యాం:- తమరూ మక్కాకి వచ్చినారు కదూ!
మాల్వీ:- ఆ, అవును. మీకు యాద్ వుందీ!

ఖయ్యాం:- హాసన్ వస్తూ దారిలో నాఖిని చూచారు. యాద్ వుందా?

మాల్వీ:- మాకీ యాద్ లేదు (భయపడతాడు).

హాసన్:- ఖయ్యామ్! ఇది అప్రస్తుతం. మాత్రం ప్రస్తుత మాల్వీ వేసిన ప్రశ్నకు జవాబివ్వటం మానేసి, ఏమిటిది?

ఖయ్యాం:- ఆగు, హాసన్! నామీదే నేరారోపణ చేస్తున్నాడు. నేను లడ్కీని లేవదీసుకొచ్చానని ఏమేమో వాగుతున్నాడు. పరారై పోదాం రమ్మని నాఖిని బ్రతిమిలాడితే బడితతీసుకొని - పాప! (నవ్వుతూ) అప్ప ఖున్నండీ కాలు-

మాల్వీ:- (ఖయ్యామ్‌ని కోపంగా చూస్తాడు. హాసన్‌తో) మాకు జరూర్ పని ఉంది, జహాపనా! వెళ్ళివస్తా. (పోబోతాడు).

హాసన్:- మాల్వీసాహెబ్! ఆగండి. (ఖయ్యామ్‌తో) ఖయ్యామ్! నువ్వు హాసన్‌తో కాదు మాట్లాడేది. పర్షియాపాదుషాతో - మైమరచి ప్రవర్తిస్తే మా ఆగ్రహానికి బలిఅవుతావు.

ఖయ్యాం:- (నవ్వుతూ) మైమరచి నేనుకాదు హాసన్ మాట్లాడేది. నువ్వు, బాల్యస్నేహాన్ని చిన్ననాటి మరచి అధికార గర్వంతో ఊగిపోతున్నావు. హాసన్! నువ్వు పర్షియాపాదుషావైనా ప్రపంచవిజేతవైనా ఫలానా హాసన్ వని మాత్రం మరవకు. ఆలా మరచే ఎందరో పాదుషాలు పరువుప్రతిష్ఠలు మాసిపోగా పతనమై కాలగర్భంలో కన్నుమూశారు.

మాల్వీ:- సర్కారు సాధారణమానవుడైతే దేశంలో జనంకి భక్తి వుంటుందా?

ఖయ్యా:- మాల్వీసాహెబ్! అదే తప్పు. అక్కడే పొరబడుతున్నారు.

హసన్:- అల్లా ప్రతినిధి పాదుషా, ఖయ్యామ్! పాదుషామాత్రమేగాక మతప్రవక్తగా-

ఖయ్యా:- ఆపు, హసన్! ఇక ఆపు. నీవు అల్లాప్రతినిధివే అయితే, మేమంతా ఆ అల్లానిజస్వరూపాలం. ప్రజాప్రతినిధి పాదుషా అనికూడా విస్మరించావా హసన్.

హసన్:- (జవాబుచెప్పలేక కోపంతో చిందులేస్తాడు. గట్టిగా గద్దిస్తాడు) ఖయ్యామ్!

ఖయ్యా:- ఓ, జబర్దస్తి! జులుం! నీకు బెదరిపోయే గులాంకాడీ ఖయ్యామ్. ఈరోజునుండి నన్ను, నా రుబాయత్‌ని ద్వేషించావా, హసన్! నీకు పతనంతప్పదు. చేసినమోసం దాగదు. కుట్రలతో, స్వామిద్రోహంతో ఈ స్థితికి వచ్చి బేఫికర్‌గావున్న నీకు-

మాల్వీ:- మోసంచేస్తే అల్లా ఊరుకోనేది లేదు. పాదుషా మోసంచేస్తే! అల్లా చూసుకుంటాడు.

ఖయ్యా:- అల్లా చూసుకుంటాడు! అల్లాపేరుచెప్పి అత్యాచారాలు చేద్దామనుకున్నారు. నా విశ్వాసం ప్రకారం అల్లా ఎన్నడూ ఎవర్నీ శిక్షించడు. శిక్షిస్తే అతడి గొప్పదనమే లేదేమో! పాపుల్ని రక్షిస్తేనే అతడు గొప్పవాడు. తప్పుచేసినవాళ్ళని దండించాల్సింది లోకమే. మేధావులు ధర్మబద్ధులయిన ఈ ప్రజలు.

మాల్వీ:- అంగూర్ కిషరాబ్ - అందమైనలడ్కీ - ఇవే లోకం అయినై నీకు ఖయ్యామ్. ఇక మాకు ధర్మం నేర్పుతున్నావ్!

హసన్:- విందులతో విలాసాలతో మజాచేస్తూ మతవిశ్వాసాలనే ఎదిరిస్తున్నావు. మేం సహించం.

ఖయ్యా:- హసన్! ఎందుకు నీ కీఈర్ష్య? అవును, సంత తానందోత్సాహాలతో జీవించటానికే నేను యత్నిస్తాను. నేను మరణించినా నాగోరీమీద ఎడతెగక పూలురాల్తూనే ఉంటై. హసన్! ఏడ్చేవాళ్ళని ఎవ్వరూ బాగుపర్చలేరు... అయ్యే హసన్! ఒకరు ఖుషీగావుండటం సహించరా లేక మీరూ ఖుషీగాఉండడం సహించరా?

హసన్.- అర్థంలేని సవాల్!

ఖయ్యా:- మతిలేని జవాబ్

హసన్:- ఖయ్యామ్!నువ్వు ఖిలాఫ్ ఉన్నావు. ద్రోహివి. బందీ చేస్తున్నాం.... రుస్తుం, రుస్తుం...!

రుస్తుం:- (ప్రవేశం)

మాల్వీ:- రుస్తుం! ఖయ్యామ్‌కు బందీచెయ్.

రుస్తుం:- (హసన్ ఆజ్ఞకోసం నిరీక్షిస్తాడు)

హసన్:- రుస్తుం-.

రుస్తుం:- (ఖయ్యామ్ ప్రక్కగా నిలబడతాడు)

ఖయ్యా:- హసన్! మతచర్చకని మర్యాదాగా పిలిచి బందీ చేస్తున్నావ్. ఎంతపిచ్చిగా ప్రవర్తిస్తున్నావ్? నన్ను నీమహల్‌లో బంధించినా అశేష పారశీక ప్రజా

కంఠంలో ప్రతిధ్వనించే నా వాణిని నువ్వరికట్ట లేవు. ఎందు కీ వృథా ప్రయాస!

హాసన్:- చూస్తాం. ప్రజల్లో నీ పలుకుబడి యెంతవుందో చూస్తాం. (హాసన్ వెళ్తాడు)

మాల్వీ:- నీ రుబాయి చదివేదే ఫకీర్లు. చదువుకున్న మాలాంటివాళ్ళు నీ రుబాయిని మెచ్చేదిలేదు. ... ...ఇంక తమరు సాకీతో జల్సా చేసేది లేదు. జల్సా! (వెటకారంగా అంటూ హాసన్ వెంబడే వెళ్తాడు)

మోతియా:- (లోపల్నుంచీ పిలుస్తుంది) రుస్తుం!

రుస్తుం:- ఓఁ! (లోపలికి వెళ్తాడు)

ఖయ్యా:-

పచ్చనితోటలోన రసవత్తరకావ్యము అల్లుచుండగా
వెచ్చని శీధువున్ సొగసుబిత్తరినాకయొసంగుచుండపొంగ నం
దిచ్చెడివేళ మాసెనో! మనిషి ఉరూజి ప్రియంబుబల్కగా
అచ్చటముచ్చటంగను ఖయామహయామ మిక మారిపోయెనా?

రుస్తుం:- (ప్రవేశం) బేగంసాహెబా తమతో మాట్లాట్టానికి [illegible] వస్తున్నారు. (బైటకు వెళ్తాడు)

మోతి:- (మోతియా ప్రవేశం. జనానా అని గౌరవభావంతో ఖయ్యామ్ ఆమెవైపుచూడక మరోవైపు తిరిగి నిలబడి ఉంటాడు) సలాము లేకుం షాయిరాజీ!

ఖయ్యా:- వస్సలాము లేకుం. బేగంసాహెబా! నన్ను ఎగతాళి చేస్తున్నారా?

మోతియా:- ఇందులో ఎగతాళి యేముంది?

ఖయ్యాం:- సాదుషా పసుప వాక్కులకు, తమనమోవాక్కులకు తారతమ్యం ఉండటంవల్ల.

మోతి:- అభిప్రాయభేదం ఉంటే అంతేగా, షాయిర్ జీ! కన్నెత్తికూడా చూడరాదా ఖయ్యామ్ జీ!

ఖయ్యాం:- అనుకూలదాంపత్యంలో అభిప్రాయభేదా లుంటయ్యా బేగంసాహెబా! ఏమంటారు? (ఆమెవైపు చూసి ఆశ్చర్యపోతాడు. మోతియా నవ్వుతుంది) మోతీ! ఎవరు?

మోతి:- ఆగండి. ఖయ్యామ్ అయితే మాది అనుకూల దాంపత్యం కాదంటారా?

ఖయ్యాం:- మోతీ! అలా ఎప్పటికీ కోరను.

మోతి:- దేనికీ, అంటానికా, ఉంటానికా? (కిలకిలా నవ్వుతుంది) పరిచారకులు వింటారు. ఇక్కడ నన్ను మోతియా అని పిలవండి. బేగంసాహెబా అన్నా అనక పోయినా-

ఖయ్యాం:- నా కుస్రూ ఎక్కడ?

మోతి:- క్షేమంగా వున్నాడు.

ఖయ్యాం:- కుస్రూని నాకప్పగించు. మోతియా! నువ్వు నన్ను మోసంచేశావు. కుస్రూదాది నని చెప్పి ఆ పసివాణ్ణి ఈ పెద్దపులిబోనులో బంధించావు.

మోతి:- కుస్రూదాదిననటంలో అబద్ధంలేదు. ఒకప్పు డది యథార్థం. హసన్ దుష్టచర్యలు మితిమీరుతున్నై. అందు కని కుస్రూని-

ఖయ్యాం:- హసన్ మందిరంలోకే తీసుకొచ్చావా?

మోతి:- భయపడకండి. ఇదంతా తమఅనుగ్రహాన్ని ఆశించి చేసినపని. పాయీర్ జీ! ఎదటివారిమనస్సు నిట్టే పసి కడతారు. మేధావులు, సర్వజ్ఞులు. మీామీాద పగసాధించా లనుకుంటున్నాడు హాసన్. ప్రజలు మీా రుబాయీలను చదివితే శిక్షిస్తున్నాడు. కాని నేనే నిత్యం మీాకావ్యం పఠిస్తున్నాను. ఆ సంగతి—

ఖయ్యా:- తెలిస్తే ...

మోతియా:- (తేలిగ్గా అంటుంది) ఫికర్ నహీ. (ఖయ్యామ్‌కు దగ్గరగావస్తుంది) మన కేమీా భయంలేదు. పాయీర్ జీ! హృదయమున్నవాళ్ళు రసికులైనవాళ్ళు తమ రుబాయత్ విని కళ్ళు కద్దుకుంటారు. ఎన్నిరోజుల్నుండో ఓ కోరిక. ఖయ్యాంజీ! తమరిని ఒంటరిగా కలుసుకుని మాట్లాడాలని ... తమఆజ్ఞకై—

ఖయ్యా:- రేపే కుస్రూను తీసుకురమ్మని మాఆజ్ఞ. (వెళ్ళబోతాడు.)

మోతి:- వెళ్ళకండి. పాయీర్ జీ! మీా రింతకుముందు ఒక రుబాయి చెప్పారు. ఖయ్యామ్ హయ్యామ్ మారిందన్నారు. నిజం. అనాలోచితంగా మీారన్నా మీామాటలు మహత్తరమైన అర్థాన్ని సాధిస్తై.

ఖయ్యా:- అనాలోచితంగా ఏ మాటా అనను మోతియా!

మోతి:- అయితే, మరోఅర్థంలో కావచ్చు. పచ్చికబయళ్ళ బదులు పట్టుపాన్పులు. మరింతఘసందైన షరాబ్. సాకీకన్నా రూపలావణ్యవతి సహేలీ (నవ్వుతూ) ఈ

అంతఃపురంలో మీ ప్రియ ఇక్కడవుమాత్రం తక్కువే ముంది తమకు. మంత్రించిన కుక్కలా మారుస్తాను హాసర్‌న్ని.

ఖయ్యా:- (కోపంగా గద్దిస్తాడు) మోతియా!

మోతి:- (బతిమిలాడుతూ) మీ సౌందర్యోపాసనకు తన్మయత్వం చెందాను. మీ మనోహరాకారం నన్ను ముగ్ధురాల్ని చేసింది. ఖుషీ జల్సా విలాసమయం ఖయ్యామ్.

ఖయ్యా:- ఖయ్యామ్‌ని మోసంచెయ్యదలచావా మోతియా? ఈ తుచ్ఛ భోగాసక్తుడు కాడు ఖయ్యామ్. ఆశించినట్లయితే ఏనాడో అఖండైశ్వర్యం లభించేది. పన్నెండు నూర్ల బంగారునాణేలు సాలీనా వచ్చినా లక్ష్యపెట్టని ఖయ్యామ్ ఈ నీ భోగాలకి లొంగిపోతాడా? నాకు కావలసింది నా ప్రియతమమైన నిండు మధుపాత్ర. గుల్‌షన్ జీవితం. ఆ తోటలోనే ఒక ఎండిన రొట్టె రెండురోజులకొకసైనా చాలు - చాలు మోతియా అర్థమైంది, నీ నీచబుద్ధి.

మోతి:- మీరు నన్ను నిరసించిన మీ ముందు నిలబడిఉంటే మీమాటలు వింటుంటే ఎంతో ఖుషీగా ఉంటుంది. మీరన్నట్టు జన్నత్ దోజక్ అంతా వట్టివి. మీ రుబాయి చదివినప్పుడల్లా ఆ స్వర్గ నరకాలమాట అటుంచి మీ మనోహరాకృతి తనివితీరా చూడాలన్న గాఢవాంఛ ఖయ్యామ్. మీమీద ఎంతో ఆశపెట్టుకున్నాను. తాగండి ఖయ్యామ్. ఖుషీగా షరాబ్ తాగండి. ఇక్కడ ఆరామ్‌పొందండి. (మధు విప్వ

పోతుంది. ఖయ్యామ్ మధుపాత్రని క్రిందకు త్రోసివే
స్తాడు).

ఖయ్యా:- మోతియా ఈరోజునుండి నా రుబాయి చదవ
వద్దు. నీలాంటి మతిగాలినవాళ్ళు నాకవితనుఅపార్థం
చేసుకోనేదానికన్నా నశించినా ఫరవాలేదు.

మోతి:- హసన్ కుస్రూకై హనిమాఅంతా గాలిస్తున్నాడు.
కుస్రూను వేయికళ్ళతో కాపాడుతున్నాను.

ఖయ్యా:- నీ మాయోపాయంతో నన్నుబంధించావా మో
తియా! కానీ చూద్దాం. నా కుస్రూకు ఏ ప్రమాదం
సంభవించినా నీప్రాణానికే మోసం.

మోతి:- తమరు మన్నించనినాడు నాజీవితమే వ్యర్థం. ఆప్త
మిత్రుడి కుమారుడు కుస్రూ. తల్లిదండ్రి లేనివాడు.
వాడి ప్రాణరక్షణమే తమకర్తవ్యంకదూ ఖయ్యామ్‌జీ.

ఖయ్యా:- నన్ను భయపెడుతున్నావా మోతియా.

మోతి:- ఎంతమాట - అది నాకు సాధ్యంకానిపని.

ఖయ్యా:- (వెళ్ళిపోతాడు)

మోతి:- ఆగండి ఖయ్యామ్. పాదుషాహుకుం ఏమిటో
తెలుసా?

ఖయ్యా:- బంధీచెయ్యమని (నిర్లక్ష్యంగా).

మోతి:- ఆ హుకుం జాములు చెపుతాను. కొంచెం సవరణ
మాత్రమే. ఇనుపసంకెళ్ళబదులు ఈదాసిబహుబంధం.

(దగ్గరకు పోబోతుంది. ఖయ్యామ్ అసహ్యించుకుంటాడు. మోతియా కోపంతో చూస్తూ) ఆఖరుసారి కుస్రూను చూసివెళ్ళండి పాపం! (చక చకా లోపలి కెళ్తుంది.)

ఖయ్యా:- ఆఖరుసారి - మోతియా! (వినిపించుకోకుండా (లోపలి కెళ్తుంది) మోతియా - హంతక్! నిన్ను-

మోతి:- (ప్రవేశం) ఆఁ, నన్ను కాదు ఈకుస్రూను చూడండి. పాపం! ఇక వెళ్ళచు.

కుస్రు:- ఖయ్యామ్‌జీ! నన్ను మీవెంబడి తీసుకెళ్ళండి. మోతీ నన్ను కొడుతోన్నది. నాకూ రోటీ ఇవ్వటం లేదు. (ఏడుస్తాడు)

ఖయ్యా:- (కుస్రూదగ్గరకు పోబోతాడు)

మోతి:- ఇక వెళ్ళండి.

ఖయ్యా:- (కుస్రూపరిస్థితి చూసి బాధపడతాడు. అతడికళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి. రుద్ధకంఠంతో ఏదో చెప్పబోయి ఆగుతాడు. కొద్దిగా ఆలోచిస్తాడు) మోతియా! సైతానుగా ప్రవర్తించవద్దు. నాకుస్రూను అన్యాయం చెయ్యకు. ఆపసివాడు నీ కేనేరం చెయ్యలేదు. నన్ను రేపు కలుసుకో - అపార్థంచేసుకున్న నాకవితలోని నిగూఢమైనభావం తెలియజేస్తాను - కుస్రూకు ఏ ప్రమాదంలేకండా కాపాడమనీ, రోటీయిచ్చి ఓదార్చమనీ నిన్ను ఈనాడు ఖయ్యామ్ - పాదుపాలనైనా లెక్కచెయ్యని ఖయ్యామ్- ప్రార్థిస్తున్నాడు...

మోతి:- తమని బాధపెట్టినందుకు మన్నించండి. (ఖయ్యామ్ పెద్ద విచారంగా) ఖయ్యామ్‌కు మధుపాత్ర అందించే భాగ్యం మోతియకున్నా కూడా కల్గుతుంది.

కు.సూ:- హైకీ— ఖయ్యామ్ నువ్వు మధువందిస్తే త్రాగడు.

మోతి:- నాకు వాళ్ళు మధువు సేవించే అందమైనపాత్ర అందిస్తాను—

కు.సూ:- పాత్రను కాదుగా త్రాగేది. మధువు కావాలి మంచిది.

మోతి:- ఖయ్యామ్ త్రాగే మధువు ఎక్కణ్ణుంచి తెప్పిస్తాడు.

కు.సూ:- నాకు తెలీదు.

మోతి:- నీకు తెలుసు. కుసుమా! చెప్పవ్?

కు.సూ:- నాకు రోటీ పెడితే చెప్తా.

మోతి:- ఓ, అలాగే. రా. (బైటనుంచి ఎవరో వస్తున్నట్లు ధ్వని వినపడి అటు చూస్తుంది.) కుసూ! హసన్ వస్తున్నాడు. పద, పద.. ...(లోపలి కెళ్తారు)

హసన్:- మోతీయా, మోతీయా!

మోతి:- వస్తున్నా. (ప్రవేశం) ఏం హుకుం అలంపనా?

హసన్:- హుకుం! నేను ఇచ్చినహుకుంకు వ్యతిరేకంగా ఖయ్యామ్‌ను విడుదలచేసింది దేనికి?

మోతి:. తమరు ఆలోచనలేకుండా అతణ్ణి నాలుగుగోడల మధ్య ఉంచదలచారు. కాని–

హసన్:- కాని, నువ్వు స్వేచ్ఛ ఇచ్చావుకదూ?

మోతి:- నాలుగుగోడలమధ్య ఉంటే బందీఅయినాడనేగాని, ఇప్పటికన్నా అతనికి కొంతస్వేచ్ఛ ఉండేది ఆలంపనా?

హాసన్:- ఇప్పుడూ?

మోతి:- పూర్తిగా మనబందీ?

హాసన్:- చిత్రం. ఏరకంగా -

మోతి:- కుస్రూ నావద్దఉన్నాడని నమ్మించాను. పాపం, నవమాళిక, అలంకనా!... కుస్రూ ప్రాణాలు మాచేతిలో ఉన్నై. కుస్రూ మంచికోరితే హాసన్‌బిన్‌సబాహ పాదుషాకు లొంగిపో. పాదుషామతం స్వీకరించు అని బెదరించాను.

హాసన్:- శెహబాష్ - నీ తెలివి చాలబాగుంది. మేం నీ ప్రజ్ఞకు మెచ్చుకున్నాం.

మోతి:- నా జిందగీ సఫలమయింది, అలంకనా!

హాసన్:- కాని, ఖయ్యామ్ బందీఅయినాడని ఊరంతా ప్రాకి పోయింది. బందీచెయ్యమని మా హుకుం. దానికి విరుద్ధంగా అతడు స్వేచ్ఛగాతిరగటం మాకు అగౌరవం. మహల్‌లో బందీచేసిఉంచే మంచిగామాట్లాడుదాం. పట్టుపడక తప్పించుకుంటాడా?

మోతి:- అంతశ్రమ పడఖర్లేదు. కుస్రూ మనవద్దఉన్నంత వరకు.

హాసన్:- మోతియా! ఖయ్యామ్‌సంగతి నీకంటె నాకు బాగా తెలుసు. చాల తెలివైనవాడు. అతడికి సదరుద్దీన్ పాదుషా మద్దత్ కూడా ఉంది. పూర్తిగా నీమాట కాదంటంలేదు. కాని, మాహుకుం ప్రకారం బందీగా ఉండాల్సిందే. (వెళ్ళబోతాడు)

మోతి:- ఆగండి. మీమతంలోచేరండని బలవంతంచేసినట్లు ప్రజలు తెలుసుకున్నా - పవిమాందిలో అతణ్ణి అగౌరవించినా - ప్రజలు తిరగబడతారు. ఆలోచించి పనిజరపాలి, జహాపనా!

హసన్:- మోతియా! హసన్ ఎన్నటికీబైటపడడు. ఖయ్యామ్ కంట పడకుండా కార్యంసాధిస్తాడు. (హసన్ వెళ్తాడు)

మోతి:- హసన్ బైటపడడు. ఖయ్యామ్కంట పడకుండా కార్యంసాధిస్తాడు. - హసన్ మాయోపాయం - హుకుం. (తనలో తాను గొణుక్కుంటుంది. దీర్ఘంగా ఆలోచిస్తుంది. వెంటనే ఏదో స్ఫురణకు వస్తుంది. లోపలి కెళ్తుంది.)

— తెర —

# ఉమర్ ఖయ్యామ్

## నాలుగవ రంగము

*ఉమర్ ఖయ్యామ్ నివసించు పూదోట.*
*సాఖి ఒక్కతైతే విచారంగా ఉంటుంది.*

సాఖి:- పాట :-

ఓ వినీలగగనపథ మేఘమాలా
నవీన తుషార సుషమానిలా
పాదుషాబందీలు గాక
ఏ దేశమైనా పొండి
షాయిరాజి ఖయ్యాముకు బందీ
సైతాను కల్పించెను లెండి ॥ఓ॥
కమ్మని నెత్తావి జమ్ముట
తప్పమ్మా పోసనీ,
నెమ్మది మధురస్మృతి రేపే
వమ్మా బుల్ బుల్ - పోస్ -
అంగూర్ - ఖర్జూర్ -
అరవిచ్చిన గులాబీ
పాదుషాబందీలు గాక
ఏ దేశమైనా పొండి
షాయిరాజి ఖయ్యాముకు బందీ
సైతాను కల్పించెను లెండి ॥ఓ॥

వెన్నెలచిలికిసే రాత్రులు
విడిచిపోండి మాదేశం
కన్నుల కిపగు వాగులు
కదలకండి ఇంకిపోండి
పాదుషా బందీలు గాక
ఏదేశమైనా పొండి
పాయిూర్జి ఖయ్యాముకు బందీ
సైతాను కల్పించెను లెండి ॥ఓ॥

హసన్:- (మెల్లగావచ్చి నిలబడతాడు, వెనకాలగా నవ్వుతూ)
బిస్మిల్లా మేం సైతాన్లము కాము, సాఖీ! సుల్తానులము.

సాఖీ:- (అసహ్యించుకుంటుంది) ఛీ!

హసన్:- ఆగ్రహం గాని మా మాట వినవలసిందిగా ప్రార్థన.

సాఖీ:- పాదుషా అయితే కావచ్చు. పరాయిస్త్రీలు ఒంటరిగా ఉన్నప్పుడు ఇంతచొరవ తగదు. ఫో- రక్ బయటికి వెళ్ళవలసిందిగా తెలియజేస్తున్నాం.

హసన్:- ఓ - ఆజ్ఞ! మరి ఇ దెవరిహుకుం?

సాఖీ:- ఖయ్యామ్‌తరపున అతడిసాఖీ ఆజ్ఞాపిస్తున్నది.

హసన్:- ఈహుకుం ఖయ్యామ్ ఆజ్ఞాపాలనకే అంతరాయమైతే-

సాఖీ:- ఎన్నడూ కాదు.

హసన్:- ఐనా డది నిజం.

సాఖీ:- ఏమిటి నువ్వనేది?

హసన్:- అదే నేనూ ప్రశ్నిస్తున్నాను.

సాఖి:- హసన్ జాగ్రత్త! అపహాస్యానికి తావు కాదు. ఎవరితో మాట్లాడుతున్నావో గుర్తుంచుకో.

హసన్:- ఓ, బాగా గుర్తుంది. పారశీకమహాకవి - విజ్ఞాన వేత్త అయిన ఉమర్ ఖయ్యామ్ బీబీతో.

సాఖి:- నిజంచెప్పు. ఖయ్యాముకు అక్కడ మీరు స్వాగతం చెబుతామని - మతచర్చ అనికదూ పిలిపించింది?

హసన్:- అందుకు సందేహం ?

సాఖి:- ఖయ్యామ్ బందీఅయినాడని అంతా అనుకుంటు న్నారు.

హసన్:- హసన్ మహల్ లో ఆతిథ్యంస్వీకరించటం బందీయా? తెలివిమాలిన ప్రజలు ఏమో అంటారు. మీరూ ఆ మాటలు విశ్వసి స్తే—

సాఖి:- నీ రాకకు కారణం ?

హసన్:- సాయీర్ జి ఖయ్యామ్ బీబీకికూడా స్వాగతం చెప్ప టానికి—

సాఖి:- ఈమాటలు హసన్ బిన్ సబాహ నోటినుండీ వచ్చిన వేనా అని—

హసన్:- అనుమానం ?

సాఖి:- ఇంతలో ఇంతమార్పుకు కారణం ?

హసన్:- తమ అనుగ్రహం.

సాఖి:- ఖయ్యామ్ జీ ఎక్కడ ? నిజం చెప్పు.

హసన్:- హరంలో ఉన్నారు.

సాఖి:- అయితే నాతో పని ?

హాసన్:- ఖయ్యామ్‌సాహెబ్. తమనికూడా తీసుకరమ్మన్నారు ...అమహానీయుడి హాల్ ఖత్ మాకు ఈరోజే అర్థ మయింది. ఇంతవరకు అవివేకంగా అతణ్ణి దూషించాము. కాని ఈనాడు నిజం తెలుసుకున్నాం. ఖయ్యామ్ పాదాలముందు పర్షియా ప్రభువు తలవాల్చుతున్నాడు...రుస్తుంకి తమనిద్దర్నీ పిలుచుకురమ్మని చెప్పాము. కాని మూర్ఖుడు ఖయ్యామ్‌నే ప్రాసాదంకి పిలుచుకొచ్చాడు.

సాఖి:- రాజప్రాసాదంలో రమణీయ భోగాలెన్నడూ ఆశించని ఖయ్యామ్ ఈనాడు అక్కడ తాముండి నిన్ను పంపించారనటం శంకించతగ్గ విషయం.

హాసన్:- మావిజ్ఞాపన మన్నించికాని, ఖయ్యామ్‌జీవై భవాల కాశించికాదు మహల్‌లో ఉన్నది. మామూల్ నౌకర్లను పంపి తమను రప్పించటం తగదనే మేమూ స్వయంగా వచ్చినాము... అల్లా! నన్నెంతఅన్యాయం చేసినావు ? పవిత్రమైన ఖయ్యామ్‌రుబాయత్ మొదట్లో నిరశించినందుకు తగినమర్యాదా ! ఇల్మ్ ఇజ్జత్ ఉన్న మేమ్ వాపస్ వెళ్ళి సాఖీమామాట నమ్మలేమ- మాతో రాదు - అని ఖయ్యామ్‌కాళ్ళవద్ద విన్నవించుకుంటే పాదుషాప్రతిష్ఠకే భంగం... ఖుదా - ఈ అవమానంకన్నా మరణమే మేలు...

సాఖి:- హాసన్ ! విచారించవద్దు. ఖయ్యామ్ అతిథిగాఉన్నా బందీగాఉన్నా అతడివద్దరే ఉండటం నావిధి. ఒక వేళ నిన్ను అపార్థంచేసుకుంటే మన్నించాలి.

హాసన్:- ఖుదా ! ఎంతమాట, ఖయ్యామ్‌బీబీ ఏమిటి - ఒక సామాన్య పాదుషాను క్షమాభిక్ష వేడటం ఏమిటి - త్వరగా దయచెయ్యండి.

సాఖి:- పద - వస్తున్నాం.

హాసన్:- (సంతోషంతో ఉబ్బిపోతాడు) దయచెయ్యండి. నేటినుండీ నామహల్ విచిత్రశోభతో వెలుగుతుంది. ఇంతటి మహద్భాగ్యం పారశీకచరిత్రలో ఒక్కహాసన్‌కేనని ఉరూజీచరిత్రకారులు వ్రాయకతప్పదు. హాసన్, నీకు అదృష్టంపట్టింది. అదృష్టం ! మాల్వీసాహేబ్ అన్నమాట నిజం !

సాఖి:- మాల్వీ ఏ మన్నాడు ?

హాసన్:- కుచ్ నైహి! ఏమీలేదు. నన్ను అదృష్టవంతుడి వన్నాడు.

సాఖి:- ఎందుకు?

హాసన్:- తమ రాకవల్ల.

సాఖి:- మర్యాదకోసం ఉపయోగించే బహువచనమా లేక ఖయ్యామ్‌ని నన్ను గురించి మాట్లాట్టమా?

హాసన్:- అనుమానంతో ఆలశించకండి. ఖయ్యామ్ మన కోసం నిరీక్షిస్తుంటాడు. (అటుచూసి - చప్పట్లు కొడతాడు. రుస్తుం వస్తాడు.) అందలం తయార్‌గా ఉంది, దయచెయ్యండి. (రుస్తుం దారిచూపుతూ ముందు నడుస్తాడు వినయంగా. సాఖి అతడివెంట వెళ్లు తుంది.) మేమూ మీవెంటనే వస్తున్నాం - రుస్తుం -

సాఖీ వెళ్ళినవైపే చూస్తాడు. కాసేపు మౌనం. మళ్ళీ ఆవైపే చూస్తాడు. వికటంగా పెద్దగా నవ్వుతాడు. మరోవైపునుండి వజీర్ కూడా నవ్వుతూ వస్తాడు.

హాసన్:- వజీర్! ఏలా ఉంది?

వజీర్:- (సాఖీ వెళ్ళినవైపే చూస్తూ) అందంగా ఉంది.

హాసన్:- ఏమిటి?

వజీర్:- (నిద్రనుండి మేల్కొన్నట్లు ఉలిక్కిపడుతూ) ఆఁ, అదే తమరు చేసినపని - సాఖీని చక్కగా నమ్మించి వారు ఖయ్యామ్‌కి మనసొకర్లు ఈపాటికి సఫాచేసి ఉంటారు.

హాసన్:- (ఖయ్యామ్ గుడారం వంక చూస్తాడు. ఆగ్రహంతో పళ్ళుకొరుకుతూ) వజీర్ - తోడ్‌దో!

వజీర్:- జీ సర్కార్ (గుడారం చించి - పూలతీగెల్ని ధ్వంసం చేసి అంతా భీభత్సంచేస్తాడు. హాసన్ నవ్వుతాడు వికటంగా.) జహాపనా? తమకు అదృష్టంపట్టింది అదృష్టం!

హాసన్.- అవును... (ఖయ్యామ్ పానపాత్రను పిడికిట్లోకి తీసుకొని బలంగా నేలమీద కొడతాడు పగుల్తుంది. మళ్ళీ వికృతంగా నవ్వుతాడు.)

వజీర్:- ఖయ్యామ్ రాకకోసం సాఖీదిగులుపడుతుంది -

హాసన్:- అవును పాపం! (నవ్వుతాడు. వజీర్‌కూడా పెద్దగా నవ్వుతాడు. దూరంనుండి ఖయ్యామ్‌కూడా వికటంగా నవ్వుతున్నట్లు వినపడుతుంది)

హాసన్:- వజీర్! ఏమిటి నువ్వు ఖయ్యామ్‌నవ్వినట్లు నవ్వుతున్నావ్ -

వజీర్:- లేదు, సర్కార్! మీాగొంతుకే అలా నవ్వినట్లు వినపడింది.

హాసన్:- అరె!

*మళ్ళీ ఖయ్యామ్ వికటంగానవ్వుతూంటాడు. ఈతడవ అతడి నవ్వు దగ్గరగా వినపడుతుంది.*

హాసన్:- వజీర్! ఖయ్యామ్ జిందాహై - ఖయ్యామ్‌కు నా మహల్‌లోనే ఎవరో మద్దత్ ఇస్తున్నారు.

వజీర్:- ఆవిషయం ఆనిక దర్యాప్తుచేద్దాం. మనం ఇక్కడ ఉండరాదు, వెళ్దాం...

హాసన్:- మంచిది. నువ్విక్కడే దాగిఉండి, ఖయ్యామ్ ఏలాబయటపడినాడో తెలుసుకో. ఏమైనాసరే నేరం మోపి బందీచేసి తీసుకొనిరా. ఇద్దరు నౌకర్లని ఉండమని చెప్తాము.

*మళ్ళీ ఖయ్యామ్‌నవ్వు వినపడుతుంది. ఇద్దరూ భయంభయంగా అవైపుచూస్తూ ముందుకుపోతారు. వాళ్ళు వెళ్ళింతరవాత మెల్లగా ఖయ్యామ్ ప్రవేశం. ఉరూజీ ఖయ్యామ్‌ని పట్టుకొనివుంటాడు. తలమీద ఖయ్యామ్‌కు బలమైనగాయం తగిలింది. ఒళ్ళంతా నెత్తురుమరకలు తలకికట్టు. చాల నీరసంగా వుంటాడు. ఉద్రేకంతో - ఆయాసపడుతూంటాడు.*

ఖయ్యా:- హాసన్ ! నీపన్నుగడ మన్నైంది.

ఉరూజీ:- శాంతించండి షాయిూర్‌జి !

(ఇద్దరూ అక్కడి బీభత్సాన్ని చూసి ఆశ్చర్యచకితు లౌతారు) పాయిూర్‌జీ ! ఏమి టిది ?

ఖయ్యా:- ఆశ్చర్యం ఏముంది ? కవి గుడారంవద్ద అధికార దర్పోద్ధతుడైన పాదుషా అడుగుజాడలు - (తలమీద గాయంవల్ల బాధతో మూల్గుతాడు) సాఖీ - సాఖీ - ఎక్కడ ?

ఉరూజ:- (కలయజూస్తాడు) లేదు పాయిూర్‌జీ !

ఖయ్యామ్:- లేదా ! నాసాఖీ ఎక్కడా లేదా ? పో ఉరూజీ త్వరగా పో. నా సాఖీ ఎక్కడుందో చూడు. నన్ను హసన్ బందీచేస్తున్నా డని, ఇస్మాలియాలు కుట్రపన్ను తున్నారనీవిని నాకై వెతుక్కుంటూ వచ్చిందేమో! ఏ ప్రమాదంలో చిక్కుకుందో - వెళ్ళు నాయనా !

ఉరూజ:- చిత్తం !తమరు విశ్రాంతిపొందండి. త్వరగా వస్తాను.

*ఉరూజీ వెళ్తాడు. ఖయ్యామ్ బాధతో నేలమీద కూలబడుతాడు. పగిలిపడిపోయివున్న పానపాత్రని చూస్తాడు. బాధతో కుమిలిపోతాడు. పగిలిపోయిన పానపాత్రని చేతిలోకి తీసుకుంటాడు.*

నామధుపాత్ర నేల బడెనా ! చెలియా, సుర మట్టిపాలుగా
నే మిది నన్ను వీడి చను టేల ? జగ మ్మిక శూన్య మయ్యె ఖ
య్యాముున కీవులేక మధు వానగరాక మనోవ్రణాన సా
ఖీ ! మనజాల నీశ్వరున కే మొరవెట్టుకొనంగ నేరదన్॥

కాంతిపటాలయమ్ముల నొకప్పుడు లెస్సగ గుట్టుకొన్న ధీ
మంతుడురా ఖయామ్ఇపుడుమాసెను పొమ్ము దినమ్ములీధరా

క్రాంతులు వంగి వ్రాలుచు సలామని రెవ్వని కాత డే మహో
ధ్వాంతజగాన నొంటరికదా ఇది నీదువిలాసమా ఖుదా॥

అమరపంబు ఖలీ భువనమంతయు నేలెడు గౌరవమ్మె నా
కమరినగాని యయ్యెవి సుఖాస్పదమే ? ఇక నాయశమ్ము లో
కముల దిరమ్ముగా మధువు గమ్మగ ద్రావెడివారి పాత్రనై
ఇమిడినజాలు వారుణి వహింతును కుత్తుకనిండ దండిగా॥

*వెనకగా మోతియావచ్చి నిలబడుతుంది. చేతిలో అందమైన పానపాత్ర వుంటుంది.*

మోతి:- షాయీర్ జీ!

ఖయ్యా:- ఎవరు? - మోతీ! ఏడీ నాకుస్రూ ఏడీ? సాకీనాకు దూరమైంది - కుస్రూ ఎక్కడ?

మోతి:- కుస్రూ రాలేదు. నేనే వచ్చాను, ఒక్కతెను - మీ వెంటనే ఉండి -

ఖయ్యా:- ఎందు కీలా సైతాన్‌లాగ వెంబడించావు.

మోతి:- ఆగ్రహించకండి. తమ కేఅపాయం రాకుండా కాపాడుకుంటున్న మీ బాంది. తమచరణదాసిని కాని సైతానుని కాను.

ఖయ్యా:- మోతియా! నువ్వు తక్షణం ఇక్కడినుండి వెళ్ళు. నా ఒళ్ళంతా ముళ్ళతో గుచ్చినంత బాధగా ఉంది.

మోతి:- పరిచర్యచేసేభాగ్యం కల్పించండి షాయిర్ జీ! మిమ్మల్ని ఖూనీచేయించాలన్న పాదుషా పన్నుగడ భగ్నంచేశాను. తమకు గాయాలుతగిలినై అని వినంగానే నిలువలేకపోయినాను. ఆమాట విన్నవెంటనే -

ఖయ్యా:- అంతేనా ఇంకా ఏమన్నా విన్నావా?
మోతి:- విన్నాను. కాని చెప్పటానికి నోరురాకుండా ఉన్నది.
ఖయ్యా:- నీనోటికి అడ్డేమిటి ?
మోతి:- అంతనీచంగా చూడకండి షాయిార్ జి! మోతియా కూడా హృదయం ఉన్నది- సానుభూతి ఉంది.
ఖయ్యా:- నీకు సానుభూతి ఎవరిమీాద మోతీ!
మోతి:- మరణించిన తమ ప్రియసాఖి మీాద!
ఖయ్యా:- (క్రుంగిపోతాడు. దుఃఖంతో) మోతీ ! ఇది నిజమేనా ?
మోతి:- ఉరూజీ ఈవార్త చెప్పలేక దుఃఖంతో వివశుడై ఉన్నాడు.
ఖయ్యా:- మోతీ! నాసాఖి ఎక్కడున్నది ? ఆమెదేహం...
మోతి:- తమర్ని కాపాడుకోవాలని వచ్చిన సాఖి హంతకుల చేజిక్కింది. ఇంతవరకూ కనుపించటంలేదు. మరణించి ఉంటుందనే మానమ్మకం ఖయ్యామ్‌జీ !
ఖయ్యా:- నాజీవనానందసంధాయిని- మోక్షకాంత- మక్కాయాత్రచేసివస్తున్న నాకు అల్లాకరుణించిఇచ్చిన భువనసుందరి - సాఖి వెళ్ళిపోయింది. సాఖి - సాఖి !
మోతి:- విచారించకండి ఖయ్యామ్‌జి ! తమరు సర్వజ్ఞులు. నిత్యానందమయులు.
ఖయ్యా:- కష్టసుఖాలురెండూ అనుభవించితీరాలి. కష్టంలో ఓదార్పుకన్నా ఒక్కసారి ఆవేదన తీరేలా దుఃఖించటమే మేలేమో మోతీ ! సాఖి మధువు నందిస్తే ఏలాఅందుకున్నానో మరణదేవత విషాన్నందించినా

అలాగే స్వీకరిస్తాను. ఓదార్పులతో దుఃఖాన్ని దిగ
మ్రింగి కష్టాల్ని వాయిదా వేసుకోవటమే తప్ప. కష్టం
అనుభవించేదానికన్నా దాన్నిగూర్చిఆలోచించటమే
ఎక్కువ బాధ.

మోతి:- షాయిరాజీ ! తమకుగల్గిన ఈఆపదకు చాల విచా
రిస్తున్నాను.

ఖయ్యా:- నీ సానుభూతికి మా కృతజ్ఞతలు.

మోతి:- తమరు ఒంటరిజీవితం గడపలేరు. దయచేసి మా
మహల్‌లో ఆతిథ్యం స్వీకరించండి. ఇదిగో ఈ మధు
పాత్ర తమకు కానుకగా తెచ్చాను. అనుగ్రహించండి
షాయిరాజీ ! (ఖయ్యాముకు పాత్ర అందిస్తుంది)

ఖయ్యా:- (మధుపాత్ర అందుకొని వికటంగా నవ్వుతూ క్రింద
విసరికొడతాడు) మధుపాత్ర కానుక ! మోతీ !
నువ్వా నాకు మధుపాత్ర అందించేది ! నన్ను చిత్ర
వధచేసినా భరిస్తాను. నాకవిత నీలా అపార్థంచేసు
కుంటే భరింపలేను. నేనే నిజంగా పామరుడిలా త్రాగు
బోతునీ వ్యభిచారినీ అయితే నాకవితకూడా నాతోనే
అంతరిస్తుంది. ఇది గుర్తించుకో మోతీ ! వెళ్లు-వెళ్లు-
మోతీ అర్థమైంది నీ నీచబుద్ధి! సైతాన్! ఖయ్యాముని
పీక్కుతినే సైతాన్ - అహ్హాహ్హా అహ్హాహ్హా ? సాఖి -
సాఖీ-నాసాఖి - నన్నువిడిచి వెళ్ళిందన్నావుకదూ !
నే నమ్మను. మాకు విభిన్నత్వంలేదు. నాలోనేఉంది.
సాఖి - సాఖీ ! ఈసైతాన్ నన్ను నీ నుండీ వేరు
చేస్తున్నది—

మోతి:- షాయిరాన్ జి ! శాంతించండి, మీకు మతి స్థిరంగా లేదు. హాకీముల్ని పంపించుతాను.

ఖయ్యా:- హాకీమ్ వద్దు. కుస్రూను పంపితే చాలు. మోతీ - మోత్తీ - (వినిపించుకోకుండా వెళ్తుంది)

వజీర్:- (పక్కనుండీ ప్రవేశం. వెనకగావచ్చి పట్టుకుంటాడు ఖయ్యాముని) ఖయ్యామ్‌జి ?

ఖయ్యా:- వజీర్ ! (ఆశ్చర్యపోతాడు)

వజీర్:- హారంలోని జనానాస్త్రీలచేతిలో మెరసే మధుపాత్ర ఇక్కడి కేలావచ్చింది ఖయ్యామ్.

ఖయ్యా:- నీ వేలా వచ్చావో అదీ అలాగే వచ్చింది.

వజీర్:- అంటే ?

ఖయ్యా:- అది దొంగదారిన వచ్చింది వజీర్ !

వజీర్:- అయితే నేనూ ?...ఖయ్యామ్ ఇది రాజద్రోహం. ఈ నేరంవల్ల నిన్ను బందీచేస్తున్నాం. ఎవ రక్కడ ... ...(ఎవరూ పలకరు)

ఖయ్యా:- ఎవరూ లేరు వజీర్! శ్రమపడకండి. హాసన్ మహల్ కేకదూ ? రాండి నావెంట రాండి—

వజీర్:- మంచిది నడవండి—

*ఇద్దరూ వెళ్తుండగా తెర*

# ఉమర్ ఖయ్యామ్

## ఐదవ రంగము

*హసన్ బిన్ సబాహ మందిరం. అంతకుపూర్వంకంటె అందంగా అలంకరించబడిఉంటుంది. పరిమళద్రవ్యాలు పెట్టిఉంటవి. ప్రక్కగా అందమైన పాన్పు.*

సాఖి:- (భయంభయంగా చూస్తూ వస్తుంది. ఆవెనకాలే మాల్వీసాహెబ్ వస్తాడు.) ఖయ్యామ్‌జీ ఎక్కడున్నారు?

మాల్వీ:- (మాట్లాడడు)

సాఖి:- మాట్లాడవేం? మీ రేదో మోసంచేస్తున్నారుమాల్వీ సాహెబ్!

మాల్వీ:- ఖయ్యామ్ ఇక్కడికే వస్తారు.

సాఖి:- కాదు. నేనే వారివద్దకు వెళ్తాను. ఈపాదుషాల రివాజ్ మాకు నచ్చదు.

మాల్వీ:- పాదుషాల మహల్‌లో ఉన్నప్పుడు వారి రివాజే పాటించాలి సాఖి! ఎందు కట్లా బెదరిపోతావ్? మాకీ పులులు సింహాలము కాముగా సాఖి!

సాఖి:- ఎలుగ్గొడ్డుమొహం అదిగో!

మాల్వీ:- ఏదీ ఎక్కడ ఉంది?

సాఖి:- అదేం నీమొహమే!

మాల్వీ:- (ఇకిలిస్తాడు) - అరె, నేను ఎలుగ్గొడ్డు! ఎంత అందంగావర్ణించినావు. నువ్వు తిట్టినాబల్ గమ్మత్తుగా ఉంటుంది. నాకీ బహుత్ ఫసంద్.

సాఖి:- ఇక నోరుకట్టైయ్...ఖయ్యాం ఎక్కడున్నారో చెప్పు.

మాల్వీ:- ఒక్కనిమిషంలో వచ్చేస్తారు. ఆఁ, అంతా తయ్యార్ ఉంది. ఇది చూడు అత్తర్ - ఎంత ఘుమ్ ఘుమాగా ఉంది. మజాచేస్తుంది కదూ. (అత్తర్ దాన్ అందిస్తాడు. సాఖి దాన్ని మాల్వీమీద కోపంతో విసరికొడుతుంది. మాల్వీ క్రిందపడ్డ అత్తర్ దాన్ తీసి ప్రక్కన పెడతాడు. నవ్వుతాడు) అరే, అల్లా! మమ్మల్ని ఎంతగమ్మత్ గా కలిపినావు-ఈరోజు. నామీద అత్తర్ చల్లినావు. అహ్హాహ్హా! మనకీ భయంలేదు. (వెనక్కి తిరిగి చూస్తాడు భయంగా)

సాఖి:- ఖయ్యామ్, ఖయ్యామ్ (దుఃఖిస్తూ కూలబడుతుంది)

మాల్వీ:- (ఒణికిపోతూ ఆదుర్దాపడతాడు) అరె! అరె! వద్దు వద్దు. నీకాళ్లు మొక్కుతాన్ - ఆలంపనా ఆరహేహై. నా పీకమీదికి తెస్తావు!

సాఖి:- ఆఁ, హాసన్! హాసన్ వస్తాడా ఇక్కడికి?

మాల్వీ:- ఆఁ, ఆఁ - నైహీ నైహీ - ఖయ్యామ్ - నీఉమర్ ఖయ్యామ్ (గుటకమ్రింగుతూ చూస్తుంటాడు)

సాఖి:- (ఆలోచనలో పడిపోతుంది. కోపంతో ఆమెముఖం వివర్ణమై పోతుంది -ఏదో పగసాధించాలన్న ఆవేశం) హాసన్!

మాల్వీ:- (వెనక్కి చూసి) సలామ్, సలామ్ - సర్కార్ -...

హాసన్:- (ప్రవేశం) మాల్వీసాహెబ్! సాఖి ఆగ్రహావేశురాలైనట్లు మాకు తెలుస్తున్నది. కారణం?

మాల్వీ:- తమరే అడగండి జహాపనా! ఆలస్యంచేసినందుకు-
హాసన్:- క్షమించమని.
మాల్వీ:- ఎవరిని సర్కార్!
హాసన్:- ఫారశీకసామ్రాజ్యాధికారిణి అయిన సాఖిని.
సాఖి:- హాసన్! అహ్హాహ్హాహ్హా ఫారశీకసామ్రాజ్యాధికారిణి సాఖి! అబ్బ! ఎంత అదృష్టం. హాసన్! నామీద నీ కెంతప్రేమ!
హాసన్:- (ఆనందంతో ఊంగిపోతాడు) మాల్వీసాహేబ్! వెళ్ళమని సౌజ్ఞచేస్తాడు. మాల్వీ అక్కడినుండిపోతాడు. సాఖి! ఈ అఖండైశ్వర్యమంతా నీదే. ఈపాదుషా ఈనాటినుండి నీకు.
సాఖి:- సాఖికి అదృష్టంపట్టింది! అదృష్టం!! ఆహ్హాహ్హాహ్హా!
హాసన్:- (మొహంచిట్లించుకుంటాడు. ఏదో జ్ఞాపకంవస్తుంది) ఏమిటి ఆలా నవ్వుతావు సాఖి!... ఓ, ఐశ్వర్య మొచ్చిందన్న ఆనందం పట్టలేక ఖుషీగా నవ్వుతున్నావా! నీ అందచందాలకి పణంగా ఈ పారశీకరాజ్యమే కాదు-ప్రపంచసామ్రాజ్యమంతా నీ పాదాంకితం చేసినా చాలదు.
సాఖి:- ఊఁ. సాఖీ! ఎంతఅందగత్తె!...ఇటుచూడు నువ్వెంతఅందంగా ఉన్నావ్!
హాసన్:- (ముందుకువంగుతూ ప్రశ్నిస్తాడు-ఆశగా) నేనా?
సాఖి:- ఛీ, కాదు. నేనే (మళ్ళీ నవ్వుతుంది)
హాసన్:- నీముందు దేవకాంతల అందచందాలు దిగతుడుపుకైనా పనికిరావు. నువ్వు జగన్మోహినివి.

సాఖి:- (నవ్వి) ఇంకా—
హాసన్:- నువ్వు నా సామ్రాజ్యలక్ష్మివి.
సాఖి:- ఇంకా—
హాసన్:- నువ్వు నా హృదయరాణివి—
సాఖి:- (వెటకారంగా) ఇంకా—
హాసన్:- నాజన్మత్ సుఖం సాఫల్యంచేసే నువ్వు నువ్వు—
సాఖి:- నేను- నేనూ. (నవ్వుతుంది. అంతలోనే ఆగ్రహంతో మోము వివర్ణమౌతుంది. తీవ్రంగాచూస్తుంది. హాసన్ ఆశ్చర్యచకితుడౌతాడు. అతడిలో దిగులుపొడసూపుతుంది) నేను నీవంశనాశనానికై దాపురించిన మహమ్మారిని. నిన్ను మింగటానికై వచ్చిన సైతానని— అహ్హాహ్హా !
హాసన్:- (కోపంతో) సాఖి !
సాఖి:- చూడు. నే నెంతఅందంగా ఉన్నానో ! ఏం నన్ను చూట్టానికి భయంగా ఉందా ?
హాసన్:- సాఖి ! ఏమి టీ పిచ్చి ?
సాఖి:- పిచ్చి ! ఇద్దరికి ! కాదు నాకే! (హాసన్మీదిమీదికి పోతుంది. హాసన్ వెనక్కిపోతుంటాడు) నేను అందరిలాంటి సుందరాంగిని కాను. అందరికీ దొరికేదాన్ని కాను. నీకు భయంకరంగా కనపడుతున్నానా? అయితే నీవి పాపపుకళ్ళు. నీకళ్ళల్లో దోషంఉంది. ఖయ్యాం కళ్ళకి నేను ఎంతోఅందంగా కనపడతాను.
హాసన్:- (కోపంతో గద్దిస్తాడు) సాఖి ! (దూరంగావెళ్లి నిలబడతాడు)

సాఖి:- [వికటంగా నవ్వుతుంది) అఖండపారశీకసామ్రాజ్యాధిపతి ! నన్ను చూసి వెనక్కిపోతున్నాడు. పోవద్దు. భయపడవద్దు. నేను మింగుతాననా ఆలంపనా ? నేను నీరక్తం తాగుతాననా నన్ను చూసి భయపడుతున్నావు. హాసన్ ! రా ముందుకు రా (నవ్వు)

హాసన్:- [అసహ్యించుకుంటాడు] సాఖీ ! ఏమిటి నీకు పిచ్చి!

సాఖి:- పిచ్చి ! పిచ్చి ! (మళ్ళీ నవ్వు)

హాసన్:- (అటూ ఇటూ చూసి దిగులుగా) అరె ! మాల్వీ సాహేబ్ ! మాల్వీసాహేబ్ ! [అదేసమయానికి మోతియావచ్చి వెనకగా నిలబడుతుంది. హాసన్ ఆమెని చూడగానే గాభరాబడిపోతాడు. గంభీరంగా నటించబోతాడు]

మోతి:- [వాకిలివైపు చూస్తూ] మాల్వీసాహేబ్ మీరు వెళ్ళండి.

హాసన్:- మస్జిద్‌కు వెళ్ళలేదా మోతియా !

మోతి:- నాఅల్లా ఇక్కడేఉంటే మస్జిద్‌కు పోవటం దేనికి ! ఆలంపనా ?

హాసన్:- ఆఁ, అవును - చూడు మోతియా, సాఖీకి పిచ్చి పట్టింది. దివాని——

మోతి:- సాఖీ ! ఇక్కడి కెలా వచ్చింది జహాపనా ?

సాఖి:- (అంతకుముందునుంచీ మోతియాని తేరిపారచూస్తున్నదల్లా మోతీ అని గ్రహించింది) మోతి ! మోతీ ! నా కుర్సూను నువ్వేనాతీసుకొచ్చింది. వంచకురాలివి

మోతీ అయ్యో కుస్రూ! కుస్రూ ఎక్కడున్నాడు?
(ఏడుస్తుంది! మోతీ గాభరాపడిపోతుంది)

హసన్:- (మోతీని అనుమానంగా చూస్తాడు) మోతియా, కుస్రూను తీసుకొచ్చావా?

సాఖి:- అవును, ఆలంపనా?

మోతి:- ఆలంపనా! సాఖీ నిజంగా దివానీ! బాగా పిచ్చి పట్టింది. లేకపోతే కుస్రూ ఏమిటి; తీసుకురావటం ఏమిటి?

సాఖి:- మోసం! మోతీ! ఇది అన్యాయం.

హసన్:- నే చెప్పలేదా. మోతియా! విన్నావా? పిచ్చిపిచ్చి మాటలు!

సాఖి:- నా ఖయ్యామ్ ఎక్కడ? నా కుస్రూ ఏడీ? హసన్, నువ్వు కాదు నన్నిక్కడికి పిలుచుకొచ్చింది? నా ఉమర్ ఖయ్యామ్ ఇక్కడున్నాడని నువ్వు కాదు నాకు చెప్పింది?

మోతి:- (హసన్‌ని అనుమానంగా చూస్తుంది) నిజమేనా ఆలంపనా?

హసన్:- పిచ్చిమాటలు మోతియా!

మోతి:- దొంగవేషాలు—నాకు తెలీదా ఆలంపనా? (హసన్ బెదుకుతాడు. మళ్ళీ సర్దుకోని లేనినవ్వు తెచ్చుకుంటాడు. మోతియాకూడా నవ్వుతుంది.)

సాఖి:- విషం - గుండెల్లోవిషం - పైకి నవ్వు.

మోతి:- ఇదరావ్ - (రుస్తుంని పిలుస్తుంది. రుస్తుం వస్తాడు) లే జావ్——

సాఖి:- నేను పోను. నాఖయ్యామ్‌ని చూపండి. నా కుస్రూను చూపించండి - మోతీ! హసన్! (బలవంతంగా రుస్తుం లాక్కెళ్తాడు)

హసన్:- (వెళ్తున్న రుస్తుంని పిలుస్తాడు) రుస్తుం! మనస్సు బాగాలేదు. ప్రత్యేకపరిచర్య జరిపించండి.

రుస్తుం:- జీహాం! (వెళ్తాడు)

మోతి:- మనస్సు బాగాలేంది ఎవరికి జహాపనా!

హసన్:- సాఖీకే!

మోతి:- హకీమ్‌ని పిలిపించవద్దా?

హసన్:- (మాట్లాడడు)

మోతి:- పాదుషామనస్సు పరాయత్తంగా ఉన్నది.

హసన్:- నీసమక్షంలో మాకు అది సాధ్యంకానిపని మోతియా

మోతి:- ఏం? అంతఅందంగా ఉన్నానా - మీామనస్సునా వైపే ఆకర్షించుకోటానికి?

హసన్:- ఈరోజు క్రొత్తేముంది?

మోతి:- ఈరోజు క్రొత్తదనం మీాలో తొణికిసలాడుతున్నది. జహాపనా?

హసన్:- నామీాద నీకున్న ఖాయిష్‌అంతె. నాలోకొత్తదనం ఏముంది? ను వ్వాసించినంత?

మోతి:- నవనవోన్మేషులు పాదుషాలు. ఎప్పుడూ క్రొత్తగానే కన్పిస్తారు. క్రొత్తనే కాంక్షిస్తారు.

హసన్:- పాతవాణ్ణి క్రొత్తమాటల్తో వర్ణిస్తున్నావు అంతే నువ్వుమాత్రం నూతనత్వంకోరవా మోతియా?

మోతి:- లోలోపల తమరుమాత్రం నూతనత్వాన్ని వాంఛించరు? అది మనం వ్యక్తంచేయటం లేదేమో ఒకరికొకరికి?

హాసన్:- మోతియా! ఏదో నిగూఢంగామాట్లాడుతున్నావు.

మోతి:- నిజం పలుకుతున్నా నంతే. మీ రెప్పుడూ నూతనత్వాన్ని కోరతా రనటానికి నేను చాలను.

హాసన్:- నాలాగే నువ్వూ నూతనత్వాన్నే వాంఛిస్తున్నావా?

మోతి:- అది తమరు నేర్పిందేగా ఆలంపనా?

హాసన్:- మోతియా!

మోతి:- ఎందు కాలా ఆగ్రహపడతారు, ఆలంపనా? మాలిక్ షామాట జ్ఞప్తికి వచ్చిందా?

హాసన్:- మోతియా ఇక అంతటితో ఆపు.

మోతి:- నన్ను నమ్మిన మాలిక్ షాను మన్ను కరిపించింది మీ నూతన పరిష్వంగ సుఖానికై కదూ? కాని ఈరోజు సాఖి మనమందిరంలో రావటానికిగల కారణం?

హాసన్:- ఆధారరహితమైన ఆరోపణ మోతియా! అది దివాని -

మోతి:- దాన్ని పిచ్చి దంటున్నారు. నన్ను పిచ్చిదాన్ని చేస్తున్నారు.

హాసన్:- ఎవరు?

మోతి:- తమరే ఆలంపనా?

హాసన్:- నామీద నువ్వుచూపే ప్రేమ వట్టినటనగా ఋజువు చేసుకోదలచావా మోతియా?

మోతి:- తమమీాద ప్రేమలేక కాదు, కాని తమరు నామీాద చూపిన ఖాయష్‌అంతా నటనగా ఋజువుచేసుకో వద్దని ఆశించుతున్నాను.

హసన్:- శాసించటం లేదుకదా?

మోతి:- అంతటి సామర్థ్యం నాకేది?

హసన్:- ఉంటే శాసిద్దామనే—

మోతి:- అవకాశంఉంటే ఎవరు వొగ్గొట్టుకుంటారు?

హసన్:- నిజం మోతియా - ఈరోజు చాల విచిత్రంగా మాట్లాడుతున్నావు, ఈమధ్య చాలపాండిత్యం సంపాదించావు. ఏగ్రంథం చదివి సంపాదించావీపాండిత్యం.

మోతి:- తమకు తెలీం దేముంది?

హసన్:- నేనూ ఆ కితాబ్ చదవచ్చా మోతియా?

మోతి:- తమకు గిట్టదు జహాపనా

హసన్:- మోతియా! ఈ హసన్ విజ్ఞానవేత్త, సారస్వతోపాసి

మోతి:- అంతేకాదు కళాప్రియుడు. విశాలహృదయుడు. నాకు తెలీదా ఆలంపనా?

హసన్:- కాని నీచమైన రుబాయిమాత్రం నిరసిస్తా డని తెలుసుకదూ?

మోతి:- (మౌనం)

హసన్:- ఏం మాట్లాడ వేం?

మోతి:- రుబాయత్ అందరూ చదువుతున్నారు.

హసన్:- అందరూ నీలాగా బేగంసాహేబాలుమాత్రం కారు మోతియా?

మోతి:- కాని, కాబోతున్నారు జహాపనా?

హాసన్:- అది ద్రోహం. మేం సహించం. ఎవరు?

మోతి:- శాంతించండి. దుష్మన్ ఎవరో మీకే తెలీదా?

హాసన్:- ఎవడు మోతియా! మా అధికారాన్ని కాదనే దుష్మన్ ఎవడు?

మోతి:- (నవ్వుతూ) మిమ్మల్ని మీరే తెలుసుకోలేక పోతున్నారు.

హాసన్:- మోతియా! ఇది నవ్వులకు సమయం గాదు.

మోతి:- నవ్వుకోటానికేగా ఆలంపనా తమ రీమందిరంలో ప్రవేశించిం దిప్పుడు.

హాసన్:- మోతియా! ఏదో దాస్తున్నావు?

మోతి:- దాపరిక మేముంది? మీమీద మీకే నమ్మకం లేదు. ప్రపంచాన్ని జయించగల్గిన ధైర్యసాహసాలు గల హాసన్‌బిన్ సబాహ పాదుషాకుకూడా దుష్మన్ ఒకడు ఉన్నాడని వినంగానే భయంకల్గటం నిజంగా ఆత్మవిశ్వాసం లేకపోవటమే! మీకు ఖిలాఫ్‌గా బ్రతగ్గలవాడు ఈదునియాలో ఎవ డున్నాడు, ఆలంపనా?

హాసన్:- మామీద దుష్మన్‌ఒకడు కుట్రచేస్తున్నా డని మరెవరన్నాఅంటే అంత ఆదుర్దాపడం. కాని పాదుషా ప్రాణేశ్వరి మోతియామాటలమీద మాకు విస్వాసం ఉంది. అందువల్ల—

మోతి:- మీ ఆత్మేశ్వరికి ఆమాత్రం చనువులేదా జహాపనా!

హాసన్:- నన్ను ఎంతమోసంచేస్తున్నావు మోతియా!

మోతి:- మీరుమాత్రం. ఈ నా తెలివితేటలు తమరు నేర్పిన వేగా.

హసన్:- మోతియా! నువ్వెంతో తెలివైనదానివి. నీ సహాయం నీ అనురాగంవల్ల మాకీ పాదుషాప్రతిష్ఠ కల్గింది. నీ మేలు ఎన్నడూ మరువం. నీ అనురాగం ఆసించిన నన్ను నీముందు గులాం—

మోతి:- (హసన్ నోటిమీద చెయ్యివేసి వారిస్తుంది) ఆలా అనొచ్చా. ఆలంపనా ?

హసన్:- ఈనాడు నీముందు పాదుషాగా కాక-

మోతి:- రాజకీయప్రాబల్యంగల ఓ మతప్రవక్తగా—

హసన్:- కాదు—

మోతి:- మరి మోసకారి హసన్‌లాగ, నిలబడ్డారుకదూ (నవ్వుతుంది. హసన్ కూడా నవ్వుతాడు.) హృదయం విప్పి నవ్వి ఎన్నాళ్లైందో—

హసన్:- ఎవరు ?

మోతి:- తమరే !

హసన్:- ఏం ? నాకేంలోటుందని మోతియా !

మోతి:- నాకు తెలీదా ఆలంపనా - బంగారు రేకుల్లో పాయసాన్ని ఆరగించేపాదుషాలు, మట్టిలోబుట్టి మట్టినుండీ ఆహారాన్ని తీసుకొని ఒక్కరోజు చిఱునవ్వుతో కళకళలాడే గులాబీకి సాటిరారు-

హసన్:- ఖయ్యామ్‌రుబాయత్‌కి ఇది వ్యాఖ్యానమేనా, మోతియా! మాకూ సంతతానందం ఎందుకు లభించదో చూస్తాం ?

మోతి:- పగబట్టి ఆనందాన్ని సాధించలేరు జహాపనా ?

హాసన్:- ఆ ఆనందం మాకుదగ్గరలోనే ఉంది. అది రేపటి నుండి మాకు నిరంతరం లభిస్తుంది.

మోతి:- అది ఏలాసంభవిస్తుందో తెలుసుకోవచ్చా !

హాసన్:- రేపటితో మాదుష్మన్ అంత మవుతాడు.

మోతి:- ఎవ రా దుష్మన్ _ అతడికీ మీకూ వైరం ఏమిటి?

హాసన్:- మాఆగ్రహానికి గురికావటం, చెప్పరాని నీచకృత్యానికి పాల్పడటం. బేగంసాహెబా సొగసైనహస్తాలతో మన్నన లంది, పాదుషా పెదవులనంటి మెరసే అందమైన మధుపాత్ర ఆనీచుడిపాదాల్రమోల కన్పించింది. ఎవరో తెలుసా మోతియా ?

మోతి:- ఎవరు ఆలంపనా !

హాసన్:- అవును. హారంలోనుండి బయటకుపోని జనానాకు అల్లాంటివిషయం తెలియకపోవచ్చు. తెలియటం కూడా అంతమంచిది కాదేమో? అది ఆమె పవిత్ర శీలానికే అపయశం. ఈహాసన్ మీాద ఆమెకున్న గాఢానురాగానికే అంతరాయం.

మోతి:- నాకు సంబంధించినసంగతి ఈలా దాచటం నేను భరించలేను. నావల్ల తప్పుంటే మన్నించి అదేమిటో తెలియజెయ్యండి జహాపనా !

హాసన్:- ఏమీ లేదు. (ప్రక్కకి తప్పుకుంటాడు)

మోతి:- (అడ్డగించి) నన్ను మీరు శంకిస్తున్నారా ?

హాసన్:- శంకించటానికి కారణం ఉందంటావా ?

మోతి:- అది నా కేలా తెలుస్తుంది. ఆలంపనా?

హాసన్:- అవును. నీకు సంబంధం లేనిది నీ కేలా తెలుస్తుంది? కాని ఆదుష్మన్ ఖయ్యామ్ అనిమాత్రం తెలుసుకో.

మోతి:- నేరారోపణ-

హాసన్:- సక్రమంగా జరిగిందా లేదా అని.

మోతి:- ఆరోపణ సక్రమంగానే జరిపా రన్నమాట.

హాసన్:- అంటే-(తీవ్రంగా చూస్తాడు) అది ఆరోపణ కాదు.

మోతి:- మీా రన్నమాటేగా ఆలంపనా? అతడు దోషి అని నిరూపించటానికి తగిన ఆధారా లున్నప్పుడు ఆతడు శిక్షార్హుడే. కానినాడు హాసన్‌బిన్‌సబాహాపాదుషా అపకీర్తిపాలౌతా డని నాభయం.

హాసన్:- మేం బాగావర్యాప్తుచేసే ఈనిర్ణయం చేశాం. రేపు తెల్లవారగానే ఖయ్యాం మాకండ్లముందు ఉరితియ్యబడతాడు. ఆరాజద్రోహి రేపటినుండి స్మరించబడడు మోతియా!

మోతి:- ఖయ్యామ్ భౌతికంగా మరణించినా మరణించక పోయినా నాకు దిగుల్లేదు.

హాసన్:- అంటూనే ఏదోవిచారాన్ని మరుగుపరుస్తున్నావు.

మోతి:- నే నిందాక చెప్పలేదా జహాపనా! మీామీాద మీాకే నమ్మకం లేదని.

హాసన్:- (లేని నవ్వుతో) ఏదీ నీచేతిమీాదుగా ఒక్కసారి మధువు.

మోతి:- మీరూ ఖయ్యామ్ కాదల్చుకున్నారా ?

హాసన్:- ప్రేమమందిరంలో ప్రేయసిఅందించగా మధువు త్రాగటం- సిగ్గువిడిచి బాహాటంగా త్రాగటం ఒక్కటేనా మోతియా ? ఆఁ. నాకో కొత్తకోర్కె కల్గిం దీరోజు.

మోతి:- నూతనప్రియులు! చెప్పండి జహాపనా !

హాసన్:- నువ్వు నాకు, నేనునీకు మధువు పెదవుల కందించగా ముందుగా ఎవరు త్రాగుతారో వారి—

మోతి:- మనోరథం ఓడినవారు తీర్చాలి - అంతేనా

హాసన్:- ఆ, అంతే—

మోతి:- ఓ అదెంత? - నేనే గెలుస్తాను.

హాసన్:- గెలుపు నాది, మోతియా !

మోతి:- చూద్దాంగా. నాకూ ఈలాంటికోర్కె కలిగిం దిప్పుడు.

హాసన్:- మన శరీరాలు వేరైనా, మనస్సు లొక్కటే అని నాకు తెలీదు.

మోతి:- ఓ ఆలాగా ! మరి మరోపాత్ర అందుకుంటాను. మోతియా ప్రక్కకుపోగానే అక్కడఉన్న చిన్న పాత్రలో మధువుపోస్తాడు. వేలికున్న ఉంగరంతీసి దాంట్లో దాచిఉంచినవిషం అందులోకలిపి మళ్ళీ ఉంగరం పెట్టుకొని గిన్నెవంక ఓసారి చూచి తనలో తాను వికటంగా నవ్వుకుంటాడు. మోతియా మధు

వుతో నింపిన పాత్రలో ఏదో కలుపుతూ వస్తుంది. హాసన్ అది గమనించడు)

మోతి:- త్రాగండి, ఆలంపనా! ఇదిగో మధువు.

హాసన్:- మధువు అక్కడే నింపుకొచ్చావా మోతియా ?

మోతి:- ప్రియుడిసన్నిధికొచ్చే ప్రేయసి నిండుహృదయంతో రావాలి జహాపనా! (ఇద్దరూకూర్చొని ఆప్యాయంగా ఒకరికొకరు అందిచ్చుకుంటారు. ఇద్దరూ రెండు గుక్కలు త్రాగుతారు. ఇద్దరి మొహాలలో ఏదో బాధ గోచరిస్తుంది. ఒకర్నొకరు చూసుకొని లేనినవ్వు తెచ్చుకుంటారు.)

హాసన్:- (అనురాగం నటిస్తూ) మోతియా !

మోతి:- హాసన్! (బాధపడుతుంది)

హాసన్:- ఏమి టాలా ఉన్నావ్.

మోతి:- ప్రేమ !

హాసన్:- ఆలాగా ! (ఎక్కిళ్ళు పుట్టుకొస్తై)

మోతి:- ఏ మయింది ?

హాసన్:- ప్రేమ !

మోతి:- ఎక్కు - వైందా ?

హాసన్:- బాగా - ఎక్కు - వైంది. మోతీ ! ... మో మోసం ?

మోతి:- కడుపులో మంటగా ఉంది... హాసన్ ! ఏమిటి ? ద్రోహం ! ఏదో - కలిపావు - ద్రోహం !

హాసన్:- నువ్వూ నువ్వూ - విషం కలిపావు - మోసం...!

*ఒకరిగొంతు ఒకరు పట్టుకోబోయి పాత్రల్ని క్రిందపడేస్తారు. ఇద్దరూ వికృతంగా అరుస్తూ గొంతుల్ని పట్టుకోని నులుమేస్తూ - బలహీనులై ఊగి పడిపోతుంటారు.*

మోతి:— ఎవరక్కడ! ఖయ్యామ్‌ని విడుదల చెయ్యండి. హాసన్ మరణిస్తున్నాడు.

హాసన్:- సాఖీని విడుదల చెయ్యండి. మోతీ మరణిస్తున్నది. సాఖి ! సాఖీ !

మోతి:- ఖయ్యామ్, ఖయ్యామ్...!

*వజీర్ పరుగెత్తుకొస్తాడు. వీళ్ళిద్దర్ని చూసి గాభరాతో "మౌల్వీ సాహెబ్" అని అరుస్తూ పరుగెత్తుకుపోతాడు.*

మోతి:- ఇక నీకు దుష్మన్ లేడు హాసన్! ఇక... దుష్మన్-

హాసన్:- నీకు ఖయ్యామ్ లేడు - మోతీ ... నీకు...

*ఇద్దరూ నేలమీదపడి కొనఊపిరితో కొట్టుకుంటారు. ఖయ్యామ్-సాఖీ ప్రవేశం. వజీర్ - మౌల్వీసాహెబ్ అవెనకగా వచ్చి నిలబడతారు. హాసన్ - మోతీ మాట్లాడలేకపోతారు.*

మౌల్వీ:- ఎంతగాఢంగా ప్రేమించుకున్నారో! ఒకరిమరణం భరించలేక మరొకరు మరణించి ఉంటారు.

ఖయ్యా:— ఇంకా ప్రాణాలు పూర్తిగా పోలేదు, మౌల్వీ సాహెబ్!

వజీర్:- కొనఊపిరితో మిమ్మల్ని యాద్ చేసినారు; వాళ్ళ తప్పు మన్నించమని కావచ్చు. (అక్కడఉన్న పూలు తీసి ఖయ్యామ్‌కి ఇచ్చి) ఈపూలు వీళ్ళమీద జల్లండి.

వాళ్ళఆత్మలకు శాంతిచేకూరుతుంది. వాళ్లుమిమ్మల్నే తలచుకుంటూ ప్రాణాలు వదుల్తున్నారు.

మాల్వీ:- అవును - అవును.

ఖయ్యా:- వజీర్ సాహేబ్ ! ముందు మీ రెళ్ళి కుస్రూను, ఉమూజీని విడిపించండి. మేము ఈ మహల్ లోనుండి తక్షణం వెళ్లాలి.

వజీర్:- మంచిది. (వజీర్ - మాల్వీ వెళ్తారు)

*హసన్ - మోతీ మరణిస్తారు.*

ఖయ్యా:- సాకీ ! పాపం పూర్తిగా ప్రాణం విడిచారు. ఈ పూలు ఈశవాలమీద చల్లాలిట, సాకీ!

సాకి:- అవి ఏం పాపం చేసినై ఖయ్యామ్ జి !

ఖయ్యా:- అవును, సాకి ? ఇప్పుడే వికసించి కళకళలాడే ఈపూలు - ఈ శవాలమీద పడి వాడిపోయేగతి వీటి కెందుకు ? బ్రతుకంతా అసహిష్ణుతతో అనంతవేదనా భరంతో క్రుగ్గిపోయే ఈఅభాగ్యులశవాలమీద చల్లే దానికన్నా మనమీదే విరజల్లుకుందాం ఈసుకుమార కుసుమాల్ని. (ఒకరిమీద ఒకరు చల్లుకుంటారు)

సాకి:- జీవితం ఆనందమయం చేసుకోమనే మీమాటల్ని అపార్థంచేసుకున్నది లోకం——

ఖయ్యా:- దురాశలతో జీవితమంతా దుఃఖభూయిష్ఠం చేసు కొన్న వీరి దుర్గతిచూడు సాకి ! మనోహరమైన ఈసృష్టిసౌందర్యాన్ని తనివిదీరా దర్శించగల్గే భాగ్యం లేక, ఈనాలుగుగోడలమధ్య బంగారుపంజరంలో

బంధింపబడే జీవితం మనకు వద్దు, సాఖీ! స్వేచ్ఛా విహంగాలమై వినీలగగనపథాల్లో విహరిద్దాం. బ్రతికిన నాలుగునాళ్లు సంతోషం సంతృప్తీ అలవరచుకోమని ఈ విశ్వానికి గొంతెత్తి వినిపిద్దాం.

ఇది యొకపాంథశాల తరుణీ! ఉదయాస్తమయమ్ము లిమ్మహా
సదనము జొచ్చిపోవుటకు చక్కనివాకిళు లిందులేవు జిం
పిదు ఘనకీర్తిసాంద్రుడు నశించెను క్రొత్తగవచ్చువారికై
పదవి నొసంగిపోవలయు వచ్చినవారలు ముందుముందుగా॥

*సాఖీ - ఖయ్యామ్ వెళ్తుండగా తెర.*

---